వెత్తు ధనం యిస్తానని ఆశజూపి, కోటయ్యపై కేసుపెట్టి ఖైదుకు కుపంపమని కళ్ళనీళ్ళతో కాళ్ళమీదపడి ప్రాధేయపడిందెవరు? న్యాయపతిగారు అంతటితో ఆగండి. మీ అమ్మాయి శారద దేవి B. A. గారికి Mr. కోటిరూపాలు I mean కోటయ్యకు యెన్ని సంవత్సరాలుగా ప్రేమ సంబంధాలున్నవో మీకు తెలుసునా ?

ప్రేమలేదు, సంబంధంలేదు అంతా వొట్టిఅబద్ధాలు అభాండాలు

(విషపునవ్వు నవ్వి వోరకంటితో న్యాయపతినిజూస్తూ) అబద్ధా లని మీరు బుకాయిస్తారు గట్టిగా మాట్లాడితే నాకు తెలియ దంటారు. అంతేనా? కాని ప్రజాపతి M. L. A. గారికి వారిరువురి అన్యోన్యప్రేమను గురించి బాగా తెలుసు.

ఇదిగూడా పచ్చి అబద్ధమే!

అబద్ధమని యిప్పుడంటె యేంలాభం! నాతో యీవిషయం చెప్పకముందే మీరు జాగ్రత్తపడుంటె యింత రచ్చకెక్కేవారు గాదు. ప్లీడరుగారు! అమ్మపుట్టిల్లు మేనమామకు తెలీదూ? అబద్ధమని బుకాయిస్తారా ?

మళ్ళీ చెబుతున్నాను అంతా అబద్ధం నీవు దొంగవు, మోస గాడివి. ఖూనీకోరువు, రాక్షసుడివి, మైరావణుడివి.........

(గుండెపట్టుకొని బాధ పడుతున్నాడు. ముఖమంతా చెమటలు కమ్మి నెరిసిన గడ్డంపైకి జారుతున్నాయ్)

(న్యాయపతి ఆవేశంచూచి బాగాకడుపుబ్బనవ్వేశాడు.) అనండి యింకా అనండీ శపించండి. కాని, నిజాన్ని మాత్రం దాయ కండి. మీ అమ్మాయిని ప్రేమించి, మీ వంశం పేరు నాశనం చేస్తున్నాడని కోటయ్య మీద విషం గ్రక్కుతూ వొచ్చారు మీరు, శారదకు పెండ్లి చేయాలని యెంతో ప్రయత్నించారు అందుగ్గాను వెయ్యిరూపాయలు ఖర్చయిందని చాలా బాధ

పడ్డారుమీరు. కాని వివాహం కుదరలేదు. శారద కోటయ్యని తప్ప మరెవ్వరిని పెండ్లాడనంది. యెంతచెప్పినా వినిపించుకో లేదు. వొకనాడు రాత్రి శారదను మీరు తన్నబోయ్యారు. కాళ్లుగట్టి మెళ్ళోపుస్తి వేయిస్తానని శపథం తీశారు. ఆరాత్రే శారద నూతిలో పడబోయింది అదిచూచిమీరు గొల్లుమన్నారు ఆనాటినుంచి శారదతో పెండ్లి విషయం మాట్లాడటం మాను కున్నారు. కాని పగపట్టిన త్రాచులాగా కోటయ్యమీద ప్రతి కారం తీర్చుకోవాలని శుభఘడియకోసం యెదురు చూశారు. మనమిద్దరంకలిశాం యేవిధంగానైనా శారదనుంచి కోటయ్యను వేరు చేయ్యాలనుకున్నారు. అందుకు నా పిర్యాదును జోడించారు. కోటయ్యకు కఠినశిక్ష వేయించారు వాళ్ళసంసారాన్ని చిందర వందర చేసారు. ఆదిగుల్తో వాళ్ళమ్మ మంచమెక్కింది చిన్నతమ్ముడు బడి మానేశాడు. ముసలి తండ్రి పస్తులతో చస్తున్నాడు. కాని కోటయ్య జైల్లోనుంచి తప్పించుకున్నాడు. మీమీద కక్ష సాధిస్తాడు. మీడబ్బు కొల్లగొట్టాడు, మీఅమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు.

న్యా. ఇది యెన్నటికి జరుగదు!

ప్ర. ఈపాటికి జరిగి పొయ్యేవుంటుంది!

న్యా. ఇదంతా మీవల్లనే జరిగింది! మీస్నేహం చెయ్యడం మూలాన జరిగింది!

ప్ర. కాదు మీవల్లనే జరిగింది!

(బిగ్గరగా అరుచుకుంటూరు ఆవేశంగా వీరి కొట్లాటను చూచి డాక్టర్ ఆరోగ్యం పరిగెత్తుకుంటూ వొచ్చాడు.)

(డాక్టరు వొచ్చిన విషయం గూడా గమనించకుండా వారి వాదోపవాదాలు తీవ్రరూపం దాల్చింది).

న్యా మీవల్లనేపచ్చని మాసంసారం పదిమందికి లోకువైపోయింది!

గాదలవవల్లనే M. L. A. ప్రజాపతంటే — ప్రజల దృష్టిలో పనికిరాకుండా పోయ్యాము.

నా మాటను మీరు ఒప్పుకుంటారా ?

మరి నామాట సంగతి ?

(వారిమధ్య చేరి వారిస్తూ) Peace! Peace! ఆంధ్రులమధ్య ఐకమత్యం కుదరాలి. మీరు వెంటనే రాజీకుదుర్చుకోవాలి.

కుదరాల్సిందే మరోజన్మకు! యిలాంటి చచ్చు ప్లీడర్లు, పిసిని గొట్టు పీనుగలు చస్తేనేగాని ముందుతరం ఆంధ్రుల్లో ఐకమత్యం కుదరదు!

ప్రజాపతులమంటూ, M. L. A. లమంటూ ప్రజల నెత్తిన చేతులు బెట్టి పరిపాలన సాగించాలనే దుర్మార్గులు, దౌర్భాగ్యులు మట్టిపాలయ్యే వరకు ముందు వారికి ముక్తి రాదు.

ఎవరయ్యా దుర్మార్గులు ?

ఎవరయ్యా పిసినిగొట్టు, చచ్చుప్లీడర్లు ?

దుర్మార్గులు మేమంటారా ?

పిసినిగొట్టు మేమంటారా ?

అవును నువ్వే ?

అవును నువ్వే ?

(వారు అరుస్తున్న అరుపులకన్నా బిగ్గరగా అరుస్తూ) ఇద్దరూ ఇద్దరే దిష్టిబొమ్మలు. అనవసరంగా మీ కుళ్లునంతా బజారు కెక్కించి అల్లరిపాలుకాకండి. వినేవారు, చూచేవారు ముఖాన వుమ్మేసిపోతారు.

మరి అతని మాటలు మీరు విన్నారుగా ?

బాగా విన్నాను!

న్యా. మరి అతని దౌర్జన్యం మీరు చూచారుగా?

డా. సమస్తం నా రెండుకళ్ళతోనే చూచాను?

ప్ర. మీరే చెప్పండి యెవరు దుర్మార్గులో!

న్యా. మీరే చెప్పండియెవరు చచ్చుప్లీడర్లో!

డా. ఆంధ్రుల మేలుకోరి మీరు యింతటితో యీరగడ మానేస్తే చాలా సంతోషిస్తాను.

ప్ర. ప్రజాపతి M L A దుర్మార్గుడంటే యేలాగండి వూరుకోటం?

న్యా. మరి న్యాయపతిని చచ్చు ప్లీడరంటె వింటూ కళ్లు మూసుకోమంటారా?

డా. చెప్పానుగా యిద్దరూ దిష్టిబొమ్మలేనని వాగుడుకట్టిపెట్టి పెద్ద మనుషుల్లా బ్రతకడానికి ప్రయత్నించండి!

ప్ర. ఏమిటండి మీరనేది? అప్పటికి మేము పెద్దమనుషులంకాదనా మీఅభిప్రాయం!

న్యా. అరవై సంవత్సరాలు నిండినా వొకపన్నయినా రాలినేలమీద పడలేదు వొక్కరిదగ్గర వొక్కమాటగూడా అనిపించుకోలేదు నేను పెద్దమనిషిని కాదంటారా?

డా. గౌరవనీయులైన M L A గారికి, ప్లీడరు గారైన న్యాయపతి గారికి, డాక్టర్ ఆరోగ్యం యిస్తున్న సున్నితమైన సలహా యేమిటంటే...వొకటి (1) కుళ్ళుకంపుకొట్టె మీ కాకిగోలను కట్టిపెట్టి పెద్దమనుషుల్లా, నీతిగల తెలుగు వీరుల్లా బ్రతకమని. రెండు (2) ఇది ప్రజాయుగం. ప్రజాపాలన జరుగుతున్నదని పాతపుణ్యాలు పనికిరావని ప్రజాపతి M L A గారికి బాగా తెలుసు. అలాగే ధర్మచక్రం వెలుగునీడలో ధర్మప్రభుత్వం న్యాయాన్ని కలుగ జేస్తున్నదని ప్లీడరు న్యాయపతి గారికీ తెలుసు. కానీ, మురిగిపోయిన పాతసాంఘికాచారాలనే మీ రనుసరిస్తూ, ప్రజలను, ప్రభుత్వాన్ని, నాయాన్ని ధిక్కరించాలని మీరు కుట్రపన్నారు. నాటకమాడారు.

కుట్రా ?

నాటకమా ?

అవును! గౌరవనీయులైన వారు తెలుగుబిడ్డను అందులో బి. ఏ. వరకు చదివిన విద్యావంతుణ్ని, దొంగ్రాడని, గజదొంగని, ఖూనీకోరని, కోటిసూపాలని, పేర్లుసృష్టించి మీడబ్బుబలంతో వృత్తిబలంతో, అన్యాయంగా ఖైదుపాలు చేసారు. (ప్రేమకూ ఆధునిక ప్రపంచంలో ప్రేమకు అగ్రస్థానముందని మీకు తెలిసి కూడా, కులము, మతము, సాంప్రదాయమనే పిచ్చికలలుకని అమాయికురాలైన శారదను. అమాయకుడైన కోటయ్యను వేరుచేసి వారి అనురాగ హృదయాలను భగ్నం చేశారు. కోటయ్య సంసారాన్ని కూల్చేశారు. వాళ్ళనాన్నను పస్తుల్తో చంపుతున్నారు. వారు ప్రళయ బయంకరమైన ప్రజాద్రోహానికి బీబత్సానికి కారకులైనారు.

మీరు చెప్పినదంతా సత్యమని అభిప్రాయపడుతున్నారా ?

ఇదంతా మీకెలా తెలిసింది ?

దొంగతనం, రంకుతనం, దాగదని మీకు తెలిసిందేగా ? పతనమైన మీ పరువు ప్రతిష్టల్ని తిరిగి ప్రజలముందు నిలుపుకోవాలంటె వొక్కటే మార్గముంది !

అడుగదల్చుకుంటె మీరు చెప్పడానికి నిరాకరించరుగదా ?

మనిషికి మార్గం చూపడం మహాత్ముల లక్షణం! సెలవిస్తే తప్పక స్వీకరిస్తాం!

(చరచరా టేబిల్ దగ్గరకెళ్ళి రెండు తెల్లకాయితాలు తెచ్చి) మీరు జైలుపాలు కాకుండా మర్యాదస్తులుగా, మంచిగా బతకాలనుకుంటే, కోటయ్య... కాదు...మీరు పెట్టిన పేరు ప్రకారం, కోర్టు వారికి తెలిసిన పేరు ప్రకారం కోటిసూపాలు నిర్దోషని మే మే అతనికి అన్యాయం చేశామని యీ కాగితంలో వ్రాసియివ్వండి.

ప్ర. మీరు చెప్పేది నాకేమీ అర్థం కావటం లేదు. మేమెందుకు రాసివ్వాలి?

న్యా. ఆయన మూలంగానే కోటిరూపాలు ఖైదు పాలయ్యాయి... యింకులో నేను చేసిందేముంది?

ప్ర. నావల్ల యేమీ తప్పులేదు. తప్పంతా మీదే. మీరే వ్రాసివ్వండి?

న్యా. నేనెందుకు వ్రాస్తాను. ఆ తప్పులో మీకూ భాగముంది. మీరే వ్రాసివ్వండి?

ప్ర. మీరే వ్రాసివ్వండి.

న్యా. మీరే వ్రాసివ్వండి? (వీరివాదం మరలా తీవ్రమైంది).

డా. (గట్టిగ) మీరు వ్రాసిస్తారా లేక నన్నే పోలీసులకు రిపోర్టు యివ్వమన్నారా? (ఫోను దగ్గరకు పోతాడు).

న్యా. చూడండి. ఆరోగ్యంగారు మా యింటి వరకు వెళ్ళి పరిస్థితు లెలావున్నాయో ఒక్కసారిచూచి చిటికలో తిరిగొస్తాను?

డా. ఆ విషయంలో మీ కెలాంటి భయమక్కరలేదు!

న్యా. బోలెడా స్తి వుందండి! రొఖ్ఖం యాభై వేలు, బంగారు ముప్ఫై వేలు, యిల్లు యిరవై వేలు కుల్లు లక్ష...యింతఆస్తి...

డా. దమ్మిడీతో సహా మీకు అప్పగించేట్టు నేను చేస్తాను. నమ్మకం లేదా? లేకుంటే నా ఆస్తినంతా మీ పేర వ్రాసిచ్చేస్తాను. నా మాట నమ్మండి. ముందు స్టేటుమెంటు వ్రాయండి. కోటిరూపాలు యెక్కడున్నా పట్టి, బంధించి, ప్రాణంతో యిక్కడకు లాక్కురమ్మని యిప్పుడే ఫోనుచేస్తాను! ఊ! వ్రాయండి! (ఫోను దగ్గరకు వెళ్ళి ఫోను చేత్తో తీసుకుని) Hol.oW! Yes! Dr. Arogyam Speaking! yes! Jupiter's Club! ఆఁ! చూడండి! కోటిరూపాలనే గజ దొంగ; మన ప్లీడర్ న్యాయపతిగారింట్లో ఆ! ఆ! న్యాయ పతిగారింట్లోనండి!

No. 25, Naticnal Road:
ఆఁ! No. 25, National Road; అవునండి! పట్టపగలు జొరబడి...ఆస్తినంతా ఆఁ! వారు సంపాదించిన డబ్బునంతా దొంగిలించుకొని పోతున్నాడు ... మీరు వెంటనే అతన్ని అరెస్టుచేసి...
చూడండి...మా అమ్మాయి శారదను గూడా చంపబోతున్నాడని చెప్పండి.
ఆ మాటెందుకు చెప్పటం?
నిజం చెప్పకుంటె యెలాగ?
ప్రేమించినవాడు...ప్రేయసినిచంపుకుంటాడా. మీకంతాపిచ్చి;
ఏం ప్రేమో వల్లకాటిప్రేమ; నా కొంపముంచింది.
ఆఁ! ఆ! వెంటనే అరెస్టుచేసి యిక్కడకు తీసికొస్తే యింకా కొన్ని వివరాలు మీకు తెలుస్తాయి! యిప్పుడే వెళ్తున్నారా! ఆ! Jupiters Club! Thank you (ఫోను క్రింద పెట్టేశాడు).
ఆదగుల్బాజీగాడు యిక్కడికెందుకండి!
వొచ్చినా మీకేమి భయంలేదు!
అవునులెండి మీరుండగా నాకెందుకు భయం!
ఇంకా మీరు నిల్చుకొని వున్నారేం, యిలా కుర్చీలో కూర్చొని అనుకున్న మూడక్షరాలు, విపులంగా వ్రాసివ్వండి (ప్రజాపతి న్యాయపతి తప్పదనట్లు వొకరినొకరు చూచుకొని గిర్రున మొఖాలు చాటుగా త్రిప్పుకున్నారు.) కానివ్వండి! పోలీస్ వొచ్చేలోగా మీ వ్రాత పూర్తి కావాలి. (యిరువురూ కుర్చీల్లో కూర్చొని దీర్ఘంగా ఆలోచిస్తూ మధ్య మధ్యలో వొకరినొకరు చూచుకుంటూ వొకరిపై మరొకరు అక్కసు వెళ్ళబుచ్చుకుంటున్నారు. డాక్టరు చంద్రమండలం, తారా

మండలం గీచియున్న బొమ్మ [MAP] దగ్గరకుపోయి యేదో లెక్కలు కూడుకుంటూ వొక కాగితంమీద వ్రాసుకుంటున్నాడు అప్పుడప్పుడూ గ్లోబు దగ్గరకొచ్చి త్రిప్పి యేదో వ్రాసుకొని (MAP) దగ్గరకెళ్ళి పరిశీలనగా చూస్తున్నాడు. నాగేశం తొందరగా వొచ్చి న్యాయపతితో)

నా. సార్! సార్! (న్యాయపతి దీర్ఘాలోచనలో వుండడంమూలంగా పలుకలేదు. డాక్టరు అతనిని పిలువవద్దని సైగచేసి నాగేశం చెవిలో యేదో చెప్పి పంపుతాడు. యీలోగా న్యాయపతి, ప్రజాపతి, వ్రాత పూర్తిచేసి డాక్టరువంక చూస్తారు)

డా. పూర్తిచేశారా? Vary Good మీరు చాలా వుత్తములు. యేదీ యిలాగివ్వండి! (యిద్దరి దగ్గరనుంచి కాగితాలుతీసుకొని బాగా చదివి) యెలాగైతేనేం! యెవరివల్ల నైతేనేం కోటి రూపాలు నిర్ధోషమయ్యాయి.

న్యా. ఇంతకూ ఆయన గారు యేమని వ్రాశారో వినిపించితే బాగుంటుంది.

ప్ర. నాదెందుకు ప్లీడరు యేమివ్రాసారో చదవండి.

న్యా. మీదే ముందుచదవాలి మీరేయిందులో మొదటివారుద్దాయిలు.

ప్ర. కాదు మీరే యిందులో మొదటివారు మీదే చదవాలి.

న్యా. వీల్లేదు మీదేచదవాలి.

ప్ర. వీల్లేదు మీదేచదవాలి.

(కుర్చీల్లోనుంచి అరుచుకుంటూ పైకి లేచారు.)

డా. మళ్లీ మీలో ఐకమత్యం చెడిపోతూవుంది. వుద్రేకాలతో యిప్పుడు మనకు నిమిత్తం లేదు. మనకు కావల్సినదంతా వ్యవహారం పరిష్కారం కావటమే. యీ ఘట్టం పూర్తయ్యే లోగానే మీకొక సలహా నివ్వదల్చుకున్నాను. చూడండి మీరు మీ స్వార్థం కోసం, చేసిన పాపాల మూలంగా భయంతో,

ఆందోళనతో మీ జీవితంలోని ప్రతిక్షణం చావుబ్రతుకులమధ్య రోజులు నెట్టుకుంటూ వొచ్చారు. ప్రతి మానవుడూ తన జీవితంలో మీలాగే చేయరాని పొరపాట్లు చేస్తూ పరిహారంగా నాశనాన్ని కోరి తెచ్చుకుంటూ వుంటాడు. ఇలాంటి మానసిక దౌర్బల్యాలకు అతీతుడు కాగలవాడే మహాత్ముడు, మార్గదర్శకుడు అనిపించుకుంటాడు. కాబట్టి నా ఆంధ్ర సోదరులకంతా నేను చెప్పవల్సింది వొక్కటే ప్రజాపతి, న్యాయపతిగార్లలాగా సాంఘిక దురాచారాలకు తావివ్వక, పలుకుబడినుపయోగించి పాపకృత్యాలుచేయక; న్యాయాన్ని తల్లక్రిందులు చేసి నాగరికతకే కళంకం తెచ్చిపెట్టక, అఖండ భారతదేశానికి తెలుగుజాతి వెలుగును చూపించాలని కోరుతున్నాను! నా సలహా మీకు నచ్చిందికదూ?

(తలూపాడు).

(న్యాయపతితో) మీకుకూడా నచ్చిందా?

(నాగేశం తొందరగా వొచ్చి)

సార్! సార్! కొంప మునిగిపోయింది సార్!

ఏం జరిగిందిరా?

అమ్మాయిగారి మెడలో...

అమ్మాయిగారి మెడలో .. ఉరి తగిలించాడా ... డాక్టర్ గారూ...! వెంకటరమణా!

అదికాదుసార్! (ఒగిరిస్తున్నాడు).

త్వరగా చెప్పవోయ్!

చెబుతానుసార్ చాలా ఆయాసంగా వుంది.

కాఫీకి బేడిస్తాను త్వరగా చెప్పరా!

అమ్మాయిగారి మెడలో... దేవుని పటానికెదురుగానిలబడి.

(ఇంకా ఆతురతతో) నిలబడి! ఏం చేశాడు!

నా. తాళిబొట్టు కట్టేశాడు సార్ !

న్యా. (అలాగే కుర్చీలో కూలబడుతూ) ఆరి వీడిచావు చదరంగాను వెంకటరమణా ఎంతపనిచేశావయ్యా ! ఆసి పాపిష్టిదానా ! నిష్పాతో నాలుక కాల్చుకున్నా తరగని పాపం చేశావుకదే ; వంశంపేరు పాడు చేశావుకదే

నా. అమ్మాయిగారిని యింట్లోపెట్టి కోడికూపాలు సరాసరి మీ దగ్గరకే వొస్తున్నాడు

న్యా. (కోపంతో) వొస్తున్నాడూ ; రానీ ; యీ దెబ్బతో ఆజన్మాంతం జైల్లో కుళ్ళి చచ్చేటట్లు చేస్తాను.

(S. I. ప్రవేశం. రాగానే అందరినీ వొక్కసారి చూచాడు. హాలంతా తాపీగా కలయజూచాడు.)

S. I. మీలో Dr. ఆరోగ్యం యెవరు ?

డా. నేనేనండి ; వీరిపేరు న్యాయపతి. పేరుపొందిన పెద్ద ప్లీడరు.

S. I. Oh ! అలాగా ; నేను యీరోజే మీ వూరు బదిలీఅయ్యాను. రాగానే మీదే మొదటి పరిచయం. (న్యాయపతి S. I. కరస్పర్శ చేసుకుంటారు).

డా. వీరు ప్రజాపతి M. L. A. గారు ; రాజకీయాల్లో రాటు తేరిన గొప్ప ఘనులు.

S. I. చాలా మంచిది. ఈ రోజు చాలా శుభదినం గొప్పవారితోనే పరిచయం కలిగింది. (నమస్కరించుకుంటారు).

డా. (S. I. కి కుర్చీ చూపిస్తూ) Take your seat Sir.

S. I. Thank you Doctor !

డా. మీరు సరాసరి నేరుగా యిక్కడికే వొచ్చారా ?

S. I. లేదు. న్యాయపతిగారింటి కెళ్ళి మీరు చెప్పిన Information ను గురించిన దర్యాప్తుచేసి వొస్తున్నాను.

న్యా. దొంగను పట్టుకున్నారా ?

ఆ యింట్లో దొంగలెవరూ లేరు. అసలు దొంగ యిక్కడికి పారిపోయివచ్చాడని అక్కడివారు చెప్పారు!
ఆ! దొంగ పారిపోయి వొచ్చాడా! అయ్యో వాడి నెందుకు విడిచిపెట్టారు సార్ (గడియారం చూచి) సరిగ్గా ఆరుగంటలు.
S. I. గారూ! ఈ రోజు ఆరు గంటలకు నన్ను పబ్లిగ్గా హత్య చేస్తానని వొక ఆకాశరామన్న ఉత్తరం గూడా వ్రాశాడండి. యిదిగో (చూపిస్తాడు. S. I. చదువుకొని జేబులో పెట్టు కుంటాడు).
ఇందులో పూర్తి పేరు లేదే!
వాడిపేరు కోటయ్యసార్! తప్పు చెప్పేశానని నాలుక కొరు క్కొని) కాదుసార్; వాడిపేరు కోటిరూపాయలు! (ఈ సారి ప్రజాపతిలో కొంత కంగారు కనిపించింది)
మీరు కోటయ్యని మొదల్లో చెప్పారు...మరి...
పొరబాటుసార్! అది...అది...ప్రజాపతిగారబ్బాయి పేరు!
ప్రజాపతిగారికి కోటయ్య అనే కుమారుడున్నాడా?
అబ్బే లేదండి. వాడెవడో దొంగ!
దొంగని మీకు తెలుసా?
దొంగేమోనని నా ఐడియాసార్!
యిప్పుడు మాకు కావల్సింది, నిఖరమైన మీ వాంఙ్మూలం. ఇంతకూ యీ కోటయ్య, కోటిరూపాలు యెవరు? వారికి మీకు యేమిటి సంబంధం?
సంబంధం యేమీ లేదుసార్!
డాక్టరుగారూ మీరు చెప్పిన కోటిరూపాలనే వ్యక్తి న్యాయ పతి గారింట్లో యెవరూలేరు. కాని వారు చెప్పిన దొంగపేరు, మీరు చెప్పే దొంగపేరు బట్టి చూస్తే మీరు కొంచం Strong గా వివరాలు చెప్పాలి. మీరు న్యాయపతిగారింట్లో దొంగలు పడ్డారని ఎందుకు ఫోన్ చేశారు.

న్యా. పద్దమాటా నిజమే-యాభై వేల రూపాయల రొఖ్ఖం, ముఫై వేల రూపాయల బంగారు దొంగిలించిన మాటా నిజమేసార్ !

S. I. మీా కెలా తెలుసు ?

న్యా. మా ప్యూను నాగేశాన్నడగండి. చెప్పరా చెప్పు! నువ్వు చూచిందంతా చెప్పు !

నా. (వినయంగా S. I. దగ్గర చేతులుకట్టుకొని) నేనేమీాచూడలేదు సార్ ! అంతావిన్నాను! నేను వారికి చెప్పిందంతానా ఐడియా సార్ !

S. I. ఏమిటోయ్ వేళాకోళమాడుతున్నావా ?

నా. లేదుసార్ సత్యం చెబుతున్నాను !

S. I. సరే అలా వెళ్ళి నిలుచుకో! (నాగేశం వెళ్ళి నిల్చుకున్నాడు) డాక్టర్ గారూ న్యాయపతిగారింటివద్ద మాకు దొరికిన ఆధారాలను బట్టి దొంగలెవరో దొరలెవరో యిప్పుడే తేల్చేస్తాను. మీారు నాతో సహకరించాలి.

డా. తప్పకుండా సహకరస్తాను. కానివ్వండి.

(ప్రజాపతి, న్యాయపతి దొంగలు తామే కాబోలుననే భయముతో బొమ్మల్లాగా చలనం లేకుండా నిలబడిపొయ్యారు).

S. I. న్యాయపతిగారూ! (న్యాయపతి పలకడు), ప్రజాపతిగారూ! (పలకడు). మిమ్మల్నే పిలవటం! అలా దిష్టిబొమ్మల్లా నిల్చొనున్నారేం ?

న్యా. (తత్తరపడి) నన్ను పిలుస్తున్నారా ? యెందుకు సార్ ?

S. I. మీా అమ్మాయి పేరు శారదగదూ !

న్యా. అవును ?

S. I. మీారు దొంగని చెప్పిన నోటిరూపాలుకు మీా అమ్మాయి శారదకు యేమైనా సంబంధముందా ?

న్యా. అబ్బె యేమీా లేదు సార్ !

పోనీ కోటయ్యతో యేమైనా సంబంధముందా ?

ఏమీలేదు !

డాక్టర్ యీ విషయంలో మీ కెంతవరకు తెలుసు ?

వాళ్ళిద్దరూ ప్రేమించి పెళ్ళిచేసుకున్నారని యిప్పుడే తెలిసింది.

You are correct; (ప్రజాపతిని సమీపించి) ప్రజాపతి గారూ ?

(బెదిరిపడి) ఆఁ! నేను M L A నండి !

Oh! I See M L A ప్రజాపతిగారూ! మీకూ న్యాయపతి గారికీ యెంతకాలంనుంచి పరిచయముంది !

పరిచయమేమీ లేదుసార్ ! ఆయన ప్లీడరు, నేను M L A ని

ఇది మాత్రం చాలా అబద్ధంసార్ ! (ప్రజాపతి డాక్టర్‌ను చూస్తాడు. డాక్టరు వారు వ్రాసియిచ్చిన కాగితాలను చూపుతాడు. అదిచూచి M L A గారికి గాబరాపుట్టి)

అంతా వో మూడు సంవత్సరాలనుంచి !

అబద్దం సార్ పరిచయమేలేదు ! (డాక్టరు మరలా న్యాయపతికి కాగితం చూపుతారు న్యాయపతి కొంచెం సద్దుకొని)

అంతేసార్ ! అంతే ! మూడు సంవత్సరాలే !

ప్లీడరుగా మీరు న్యాయవృత్తి చేస్తున్నారు, M L A గా మీరు ప్రజాసేవ చేస్తున్నారు యెందుకండీ అలా అబద్ధాలనే జపిస్తూ వుంటారు ?

అది వారికలవాటేలెండి !

You are correct ! న్యాయపతిగారూ మీమీద ప్రజాపతి M L A గారి మీద మాకు C. I. D. రిపోర్టులు బోలెడొచ్చాయి.

న్యా: (యిద్దరూ వొక్కసారిగా) మామీదనా ?

అవును మీమీదనే ! కోటిరూపాలు నిర్దోషి ! మీరు కాదంటారా ?

న్యా. తప్పకుండా అంటాం. వాడు గజదొంగ!

ప్రె. వాడు ఖూనీకోరని కోర్టువారే వొప్పకున్నారు!

న్యా. నేనేనండీ ఆ కేసును Take up చేసింది. మూడు సంవత్సరాలు కఠినశిక్ష వేశారు. కోర్టు వారిచ్చిన తీర్పునుగూడా మీరు కాదంటున్నారు సార్.

S. I. కోర్టువారు C I D రిపోర్టు బాగా చదివారు నిజం తెలుసుకున్నారు. అసలు దొంగలెవరో తేలిపొయ్యారు. వెంటనే కోటయ్యను విడుదల చేశారు. మీ యిద్దర్నీ అరెస్టు చేయమని వారంట్లు జారీచేశారు. ముందుమీరు కదలండి!

న్యా. అలా వీల్లేదు. అలాచేయటానికి "లా" వొప్పకోదు. ముద్దాయికి శిక్షపడితే గడువు ముగిసేవరకూ వాడు శిక్ష అనుభవించాల్సిందే!

ప్రె. అందులో బోలెడు సాక్ష్యాం యిప్పించి, వాడు గజ దొంగని గట్టిగా నిరూపించి ఆ దొంగను జైలుకు పంపించాం.

S. I. దొంగలను అమాకులుగా, అమాయకులను దొంగలుగా మీ యిష్టప్రకారం చేయటానికి యిదేం గుడ్డికాలం కాదు అసలు దొంగలెవరో గాలించి పట్టుకోవటమే ప్రజాప్రభుత్వ లక్ష్యం. యింతకూ కోటిరూపాలు నిర్ధోషని మీరు వొప్పకుంటారా లేదా?

యిద్దరూ: మేము వొప్పకోమండీ! (డాక్టరువారు వ్రాసిచ్చిన కాగితాలను S I చేతికిస్తాడు).

S I (బాగా చదువుకొని) యీ స్టేటుమెంటు మీరు వ్రాసిందేనా? (అది చూచి యిద్దరూ విస్తుపోతారు). చెప్పండి! మాట్లాడరేం? యీ కాగితం మీది అవునా కాదా?

న్యా. అవును.

S I ప్రజాపతిగారూ మీరేమంటారు?

నాదేనండి. నేనే వ్రాసిచ్చాను.

సరే నడవండి స్టేషనుకు.

ఎందుకుసార్ ?

జైల్లో కోటయ్యకు బదులు మీరు నిద్రపోవటానికి !

జైల్లోనా ?

ఏం! అవమానంగా వుందా ?

S. I. గారు ; నేను చేసిన పాపాలకు నాలుక కోసుకోమన్నా కోసుకుంటాను. ఇంకెప్పటికి యిలాంటి నేరాలు చెయ్యను. నన్ను క్షమించండి. డాక్టరుగారూ మీరన్నా కొంచెం రెకమెండ్ చెయ్యండి. కావాలంటే ప్రజాపతిగారొస్తారు మీవెంట.

ఏమిటి ? నేనా ! S. I. గారూ నాదేమీ లేదండి నేనీమధ్యనే M L A అయ్యాను. కాస్త నా గౌరవమాలోచించి కటాక్షించండి ! కావాలంటె వారే వస్తారు మీవెంట !

నేనెందుకు పోవాలి మీరేగా యింతాచేసింది మీరేపొండి !

మీరుచేసిన పాపాలు నా నెత్తికి రుద్దుతున్నారా ? మీరేగా కోర్టులో యింత నోటితో వాదించింది ? మీరేపొండి !

నేను పోను మీరేపోండి !

మీరేపోండి నేనెందుకు ?

మీరేపోండి.

మీరేపోండి. (మరలా వ్యవహారం ముదురుతుంది. S. I. బిగ్గరగా వారిగోల అణిగేటట్టు).

Shame ! Shame ! సిగ్గుచేటు ; నోరుమూసుకోండి మీరు వెంటనే కదుల్తారాలేదా !

(తాపీగా) ఎక్కడికి సార్ ?

జైలుకి ?

న్యా. యేమిటిసార్ ! మేమేదో నాటకమాడుతుంటే మధ్యలో మీా రొచ్చి పెద్ద గొడవ చేస్తున్నారు ?

S. I. ఏమిటి ? నాటకమా ?

ప్రె. అవునండీ ... నేను అసలు M L A ని కాదు. నాటకంలో M L A ని.

న్యా. నాలాంటి ప్లీడర్లు చాలామంది దేశంలో చెలామణి అవుతూ, న్యాయాన్ని యెలా తారుమారు చేస్తుంటారో ప్రజలు తెలుసు కోవాలని, ఆ వేషం వేశాను. అంతే నేను న్యాయపతినిగాదు, ప్లీడర్ని కాదు, వొక నటుణ్ణి.

ప్రె. అంతేసార్ ! M L A ల మని చెప్పుకుంటూ ప్రజాసేవను మరచి, రాజకీయ నాయకులమని తిరిగేవారిని గురించి వొక్క కంట కనిపెట్టా వుండాల్సిందని ప్రజలను హెచ్చరిస్తూ నేను M. L. A. వేషంకట్టాను. అంతే, నిజానికి నేనూ వొకనటుణ్ణే.

డా. చూడండి సార్ ! మా సంఘం వాళ్ళు వొకనాటకం వేయా లనుకున్నారు ! ప్రజలకు నీతి, నాగరికతా, విజ్ఞానము కలిగించే వొక అభ్యుదయకళను ప్రదర్శించాలని యీా "దిష్టిబొమ్మలు" అనే నాటికను వేశాం. అందులో నేను డాక్టర్ ను, అంటే సైకాటిష్టును, సైకాలిజిష్టును. అంతే యిందులో నేనూ వొక నటుణ్ణే.

నా. నేనుగూడా వొక నటుణ్ణే సార్ !

S. I' అయితే నేనేనా అంత ఫూల్ని న్యాయపతిగా రమ్యాయిని వివాహామాడి మిమ్మల్ని భయసందేహాల మధ్య వుయ్యాల లూపిన ఘనుణ్ణి, కోటిరూపాలుగాడ్ని. మిమ్మల్ని భయపెట్ట డానికి S. I. వేషంలో వచ్చిన ఘనుణ్ణి.

అందరూ . నువ్వేనా కోటిరూపాలు ?

అవును.

(ప్రేక్షకుల నుద్దేశించి) సోదరసోదరీమణులారా! ఇంతసేపూ సహనంతో కూచొని మా నాటకాన్ని చూచినందుకు మా సంఘం తరఫున ధన్యవాదాలు. మీ అందరి సహకారముంటే ఇటువంటి కళనే ప్రదర్శిస్తూ మీ అభిమానాన్ని పొందగలం. నాటకం పూర్తయింది. శలవు. జైహింద్.

"తెర"



# "చీకటి దొంగలు"

(నాటిక)



గోపాలిచ్చిన అడ్రసును భద్రంగా దాచుకొని మండే యెండలో మెదడు కాలి, కాగి, మాడిపోతున్నా లెఖచెయ్యక, నేను చూడబోయే అమ్మాయినిగురించి, వారితో మాట్లాడవలసిన పద్ధతిని గురించి మనసులో మాట్లాడుకుంటూ, మాలకాకిలా తిరిగి తిరిగి, చివరకు రాత్రి 7, 8 గంటల ప్రాంతానికి అసలు చోటుకు చేరుకోగలిగాను. నా దగ్గరున్న అడ్రసును మరలా వొకసారి చదువుకున్నాను. యేమీ భేదం లేదు అదే అడ్రసు :—

"ఆనందనంద కిశోర సుందర గోపికానిలయ పుండరీకాక్షాశ్రమం"

1, పాండురంగ విహార్, మద్రాసు-17.

బ్రతికామురా బాబూ అనుకున్నాను విచిత్రమేమిటంటే తిరిగి తిరిగి అలసిపోయిన నా శరీరంపై అడ్రసుగల బంగళాచూచేసరికి చెప్పలేని ఆనందంతో వుత్సాహంతో గంతులేయ సాగింది. కబురు చేద్దామంటె బయట యెవ్వరూలేరు. కేకవేసి పిలుస్తామనుకోండి, ఎవరో నాటురకం మనిషిలా అనాగరికంగా హేళన చేస్తారు. సిటీలలో చాలా నాగరికతగా ప్రవర్తించాలి. ముఖ్యంగా బాగా చదువుకొని బంగళాల్లో నివసించేవారిపట్ల అందుంచి యేమి చెయ్యటానికీ నా బుద్ధి ముందుకుపోవటం లేదు. మద్రాసు రావటం క్రొత్త. యిరుగు పొరుగు యెవ్వరూ తెలిసినవారు కారు. ముఖ్యంగా అచ్చటి అరవభాష నాకురాదు. కాబట్టి యేంచెయ్యాలి- అప్పటికే రాత్రి 8 దాటింది. శరీరం చెమటవాసన కొడ్తూవుంది. వీచే చల్లని సముద్రపు గాలికి వుల్లాసంగా నిద్రపోవాలనిపిస్తూవుంది. యెక్కడ పండుకోను ? యింతకూ మనం వచ్చిన పని పూర్తి చేసుకోవాలిగా! అసలు కార్యకర్తలెవరో తెలుసుకొని మాట్లాడి పని ముగించుకొని, వీలుంటే ఆ రాత్రి బండికే మా వూరెళ్లిపోవాలని ప్రోగ్రాం వేసుకున్నాను. యిప్పటికే చాలా కాలం వృధా గడచిపోయింది. యిల్లు కనిపెట్టేటప్పటికే తలప్రాణం తోకవరకు దిగింది. ఆకలి. ఏం చెయ్యాలి ? ఎలాగైనాసరే లోపలి

వరకు వెళ్లి వివరాలు తెల్సుకుందామనుకున్నాను. "అయితే యీయిల్లు - కాకుంటే మరోది". అనుకొని మెల్లగా యింటిద్వారం తెరచి లోపల పడ్డాను. నా వెంట తెచ్చిన బెడ్డింగు, సంచి, కాగితాలు, నాతోనే వున్నవి. లోపల అడుగు పెట్టానో లేదో వొక్కసారిగా గుప్ మని కరెంటు దీపాలన్నీ ఆరిపోయినయ్ గజ్జల శబ్ధం వినిపించింది. వెంటనే లోపల నుంచి.

అదృశ్యశక్తి:— భగత్పారాణలో నిమగ్నమై సర్వేశ్వరుని సాక్షాత్కారానికి నేచేయు తపోనిష్టకు మీరాకవలన విఘాతం కలిగింది. ఎవరునువ్వు ?

నేను:— (ఏమిచెప్పాలో నోరురాక చివరకు తడబడుతూ) దా...

దా......దాను !

మూర్ఖుడా ఎవరునువ్వు ?

మూర్ఖుణ్ణికాదు...దాసును !

(పెద్దగా) ఊ ?

కాదు.......ఆంధ్రుణ్ణి !

ఆంధ్రుడివా ?

అవును.

వొస్తి అదురుగుండె ఎదిరించను శక్తిలేదా ?

ఉంది !

మరి యెదిరించవేం ? ఊ ! ఆంధ్రుడికి కావలసిన ఆవేశం నీలో క్షీణించింది.

(తడబడుతూనే) లేదు కొంచం నీరసించింది.

నీలాంటి పిరికి గుండెలు పరారై పోతేగానీ ఈ ఆశ్రమం శాంతించదు. (మాట్లాడుకుంటూ నాపైకి దూకడం ప్రారంబించిది. నేనుకొంచం వెనక్కు తగ్గాను పట్టు తప్పిపోయింది. తప్పించుకోజూస్తున్నావా ? అమాయకుడా........క్షణంలో మోక్షం నీకంటిముందే కనిపిస్తుంది. అక్కడే నిలువ్ !

(నాముఖానికి పచ్చటి వెల్తురు ప్రాకింది. తర్వాత యెరుపు ఆతర్వాత బ్లూ వెలుతుర్లు నాముఖంపై పడేసరికి నా కళ్ళు మూతలుపడి మామూలు తెల్లని వెలుతురు పడేటప్పటికి నేను క్రింద పడిపొయ్యాను తర్వాత యేంజరిగిందో నాకు తెలియదు నేను మేల్కొంచేటప్పటికి యిల్లంతా దగదగ్గాయమానంగా పట్టపగల్లా వెలిగిపోతూవుంది. నాకాశ్చర్యమేసింది యిప్పుడు నేనెక్కడున్నానా అనిపించింది. యిల్లంతా బాగా పరిశీలించి చూచాను యిల్లు చాలా విశాలంగాయుంది నాలుగుద్వారాలు ద్వారాలకు వ్రేలాడే కర్టెన్లు, విలువైన కుర్చీలు, సోపాలు, ముస్తాబుకు కావలసిన సామాగ్రి, నిలువుటద్దం, వొక రేడియో అన్నీయిన్నాయ్. ఆ యింట్లో యేదో కమ్మని వాసనేస్తుంది. ఎవరిదో వో మంచి అందమైన అమ్మాయి ఫొటో గోడకు బహుశా యీ అమ్మాయేగాబోలు నన్ను పెళ్ళి చేసుకో బోయేది. అనుకుంటూ నేను నా బెడ్డింగు సంచికోసం వెతుకు లాడాను అవి మాయమైనట్లేవున్నాయ్. తర్వాత సిగరెట్టు కోసం జేబులలో తడుముకొని చూచాను సిగరెట్టులేదు జేబు లోవున్న 300 రూపాయలు ఖాళీ సన్యాసి ప్రవేశం. తగిన వేషం. ఆపోటోకు హారంవేసి హారతిచ్చి నావైపు చూచాడు. దాహంగావుందని సైగచేశాను. లోనికెళ్ళి చెంబులో నీళ్ళు గ్లాసు తెచ్చి నాకుయిచ్చాడు. గ్లాసుతోపనిలేకుండానే చెంబుడు నీళ్లు ఖాళీచేశాను. కొంచం తేరుకొని స్వామికి నమస్కరించాను దీనంగా)

సన్యాసి :— (దీవిస్తూ) చిరంజీవివై సకల సౌఖ్యాలతో పుణ్ణమరాత్రి లాజీవితాన్ని ఆనందమయం చేసుకోనాయనా!

నేను :— అదేమిటి స్వామి-నన్నే చేసుకోమంటున్నారుగాని మీ దీవెన బలంగా పనిచెయ్యదా?

ఆచరించలేనివారికి యే దీవనా లాభాన్ని చేకూర్చదు కదా!

యెక్కడ్నించి వస్తున్నావ్ నాయనా!

తెలుగు దేశాన్నుంచి!

పేరు?

దాసు!

దాసు అంటే?

దాసునండి! మఘరాంతకం రామదాసును.

ఊరు!

రేపల్లె.

వొచ్చిన కార్యం?

(వొకనిట్టూర్పువిడిచి) యేం చెప్పనుస్వామి ప్రధానమంత్రి కన్నా పెద్ద భారాన్ని నెత్తిన పెట్టుకొచ్చాను పంచవర్ష ప్రణాళికకన్నా పవిత్రమైన కార్యంకోరకు వరసగా రెండు రాత్రులు నిద్రకాచి రైల్లో ప్రయాణంచేసి వస్తున్నాను.

ఇంకా యేమైనా తీర్థం పుచ్చుకుంటావా నాయనా?

చాలా Thanks యింకేమి అవుసరంలేదండి!

ఇంతకూ వచ్చిన కార్యమేదో............

అదే-తమకు మనవి చేసుకుంటున్నాను. ఆగష్టు 15వ తేది, "తెలుగునాడు" దినపత్రికలో మీరు ప్రకటించిన వివాహ ప్రకటనచూచాను. అందులో మీరుకోరిన అర్హతలన్నీకలిగిన నవయువకుడ్ని గాలిస్తే వెతుక్కుంటూ యీ యిల్లుచేరాను. అన్నట్టు ఇది పుండరీకాశ్రమమే గదూ?

"ఆనంద నందకిశోర సుందర గోపికానిలయ పుండరీకాశ్రమం"

నెం. 17. టినగర్, మద్రాసు. అంతేగదూ?

అవును, నాయనా!

నే. చూడండిస్వామి పవిత్రమైన మీ ఆశ్రమంలో పాపం పెట్టానో లేదో ప్రాణం అమాంతం పైకెగిరిపోయి తిరిగిపాటులోకొచ్చింది నాజీవితంలో వొక పెద్ద చావు గండం తప్పించుకున్నాను. స్వామీ...మీరేమీ అనుకోకుంటే వో ముఖ్యవిషయం చెబుతాను.........యీ ఆశ్రమంలో వొక పెద్ద దయ్యాన్ని చూచాను. నాబెడ్డింగు, సంచి, జేబులోవున్న డబ్బులూ... మూడువందలు స్వామీ...అడ్రసు లేకుండాపోయినయ్ అసలు నేను ముందు ప్రవేసించింది యిదేనా కాదా అనినాసందేహం దీనిపేరు పుండరీకాక్షాశ్రమమేకదూ?

స్వా. అయ్యో! ఎంత అపచారం జరిగిపోయింది.

నే. అపచారం జరిగినందుకు చింతలేదు స్వామి! అర్థరాత్రి కాకముందే నన్ను దోపిడీ చేసిన ఆ దెయ్యం పరమేశ్వరుడున్న యీ ఆశ్రమంలోకి యెలారాగలిగిందా అని ఆలోచిస్తున్నాను.

స్వా. యేదో స్వప్నం నిన్నలా భయపెట్టిందేమో నాయనా!

నే. తమరు సెలవిచ్చినట్టె అనుకున్నా, నావెంట తెచ్చిన సామాను వొక్కటికూడా పత్తాలేదు...

స్వా. నిజమా?

నే. మీతోడు. జేబులోవున్న మూడువందలూ పరారై పోయినాయ్ స్వామీ! యిది కూడా యెలా కల్లనుకోమంటారు స్వామీ? ఇంత దురదృష్టం జరుగుతుందని కల్లోగూడా అనుకోలేదు.

స్వా. జై వీరహనుమాన్! వో మహాలక్ష్మీ! కటాక్షించు తల్లీ! నాయనా యిది నీ దురదృష్టంకాదు. ఇందులో నీ ప్రాణానికి హాని సంభవించక పోవుటే నీ అదృష్టం.

నే. వెధవప్రాణంపాతేమాత్రం యెవరుపట్టించుకొంటారు స్వామీ! పుట్టెడు చాకిరీచేసినా పట్టెడన్నమైనా గిట్టక పరితపించే పేద

వాడి హృదయంలాగా-ప్రేమసినిచూచి పెండ్లిచేసుకొని పోదా మనుకున్న నాకు, మద్రాసులో మీ ఆశ్రమంలోజరిగిన మర్యా దకు హృదయం తల్లడిల్లి, తల్లక్రిందులై పోతూవుంది.

డబ్బులేనిదే పిల్లనెవరిస్తారు స్వామీ ?

అంతా విధివిలాసం నాయనా !

అంతే గదండీ! యిందుకు మీరుమాత్రం బాధ్యులా? యింత కూ నాకు కనిపించింది దెయ్యమేనంటారా స్వామీ ?

జై వీరహనుమాన్ ! యోగదృష్టిలో సత్యమేదో తెలుసు కుంటాను. (పళ్లెంలోనుంచి తెల్లనిపొడిని) యీ విభూది నొసట పెట్టుకో నాయనా. సమస్తదుష్టశక్తులూ సమూలంగా నాశనమై పోతాయ్. నిన్ను సమీపించటానికి యే శక్తికీ ధైర్యంచాలదు. సాహసించలేదు. యీ తీర్థం పుచ్చుకో (తీర్థంపోశాడు)

(అలాగే పుచ్చుకున్నాను. విభూది పెట్టుకొన్నాను. స్వాముల వారికి నమస్కరించాను. కొంత నిశ్శబ్దం.)

అన్నట్లు వొచ్చినకార్యం విపులంగా చెప్పనే లేదు...

మీరు వరునికోసం అంటె తగుయోగ్యతలు కలిగినవానికోసం పత్రికలో చేసిన ప్రకటన చూచాను. నా స్నేహితునికి చూపించాను. తర్వాత నా మిత్రునిద్వారా మీతో వుత్తర ప్రత్యుత్తరాలు జరిపాను. అందులో మీరుపొందుపరచిన షర తులకు కట్టుబడి, వివాహానికిసిద్ధపడి తగుమైన అర్హతా పత్రా లతో మీ ముందు హాజరైయున్నాను. ఏ పరీక్షకైనా సిద్ధ పడి వున్నాను.

ఏం చేస్తావ్ నాయనా !

అదేమిటి స్వామీ : నేనుచేయలేని పనంటూ లేదు. చెప్పండి యీ మద్రాసును మసి చేసేమంటారా ? స్వర్గలోకం వరకూ రైలుపట్టాలు తగిలించి దేముడులేడనే నాస్తికులను టికట్టు

లేకుండా స్వర్గానికి తీసుకెళ్ళమంటారా ? పదినిముషాల్లో ప్రపంచమంతా భస్మమయ్యేటట్టు ప్రపంచయుద్ధం ప్రకటించమంటారా వ్యాపారాలన్నీ స్థంభింపజేసి దేశాన్ని వొకవూపు వూపమన్నారా ? నిరుద్యోగం సృష్టించి, దరిద్రులసంఖ్య పెంచి దేశంలో అశాంతి రెచ్చగొట్టమన్నారా ? దొంగసన్యాసుల్ని దుయ్యబట్టమన్నారా ? దగాకోర్లను అరెస్టుచెయ్యమన్నారా ? చెప్పండి అమాయకుల్ని గొంతు నులివేయమన్నారా ? యేం చెయ్యమన్నారో చెప్పండి ? (యీ మాటలు చాలా యెమోషన్‌గా చెప్పాను. స్వాములవారు కొంత సర్దుకొన్నారు. నా వైపు క్రీంకను పైకి చూచి)

స్వా. చాలు — చాలు నాయనా శాంతించు. నీవు అపరవీరహనుమంతుడివి శాంతించు.

నే. ఎలా శాంతించను స్వామీ ? మీరు నన్ను పరీక్షించండి. యీ యింట్లో - కాదు యీ ఆశ్రమంలో దాగివున్న కాలకూట విషాన్ని వొక్కసారి మింగేయమంటారు. చెప్పండి స్వామి నాలో ఆవేశం నూరు మైళ్ల స్పీడ్‌లోవుంది. తగ్గిపోతే మరలా నేను మామూలు మనిషినైపోతాను.

స్వా. శాంతించు నాయనా—నీవు చాలా సమర్థుడివి. జై వీరహనుమాన్.

నే. యిప్పుడు సెలవీండి స్వామీ, మీరుకోరిన అర్హతలు నాలో వున్నాయా ? మీరుచెప్పిన అమ్మాయికి నేను సరిపోతానా? అసలు నేను పెళ్ళికొడుకయ్యేయోగం వుందో లేదో చెప్పండి. చాలాదూరంనుంచి చాలాప్రయాసతో వొచ్చాను.

(స్వాములువారు యేమిమాట్లాడకుండా మొఖం అదోలాపెట్టుకొని మౌనంగా అందమైన అమ్మాయి ఫోటోవద్ద నిలబడ్డాడు నేను నోరుతెరచుకొని ఆయన్ను అనుసరించి వెనకాలే నిలబడి అమ్మాయి అందాన్ని చూస్తూవున్నాను. స్వాములవారు

కొంతసేపు ఫోటోను చూచి కళ్ళవెంట నీరు కారుస్తున్నాడు
చూచాను).
అదేమిటిస్వామి! అలా కంటతడిపెట్టారేం?
(స్వామి పలుకలేదు)
చెప్పండిస్వామి! యీమేనా నాకు కాబోయ్యే.........
(స్వామి నావైపు దీనంగా చూచాడు)
అదేమిటి స్వామీ అలా చూస్తున్నారు? అలా దీనంగా
మౌనంగా వున్నారేమిటి? ఆ అమ్మాయికేమైనా ప్రమాదం
సంభవించిందా? యింకెవరినైనా ప్రేమించిందా? మీతో
చెప్పకుండానే పరారై పోయిందా? లేక మీలాగే సన్యాసం
పుచ్చుకొని దేశంలో టూర్ చేస్తూవుందా? యే విషయం
నాతో చెప్పండి స్వామీ మీకు యే సహాయం చేయమన్నా
చేస్తాను దేశంకోసం కాకపోయినా అమ్మాయికొరకు నాలో
చివరి రక్తంబొట్టు వృదా అయ్యేవరకూ పాటుపడి ఆమెను
తెచ్చి మీకప్పగిస్తాను. తర్వాత పెళ్ళి చెప్పండిస్వామి యీ
జగదేక సుందరి, మనోన్మణి, సుందర మందహాస నయన
చకోరి యెందుదాగియున్నదో సెలవీయండి! తక్షణం బయలు
దేరి, వొక పక్షంరోజుల్లో తిరిగొస్తాను.
నాయనా యేంచెప్పమంటావ్! అంతా విధివిలాసం ఆదైవ
కృప నీలాంటి వీర శూర పరాక్రమశాలికి ధర్మపత్ని కాగల
అదృష్టానికి ఆమెనోచుకోలేదు.
అంటే.........
ఆమెఆత్మ యీ మాయకాయం విడచి.........
పరకాయ ప్రవేశం చేసిందా స్వామీ?
పరమాత్మలో కలిసి పోయింది నాయనా!
చచ్చిపోయిందా స్వామీ! యెంతపనిచేసావురా దేముడా!
ఈ యుగంలోనైనా యీ దేముడు రామాన్ని పిచ్చి వాడు

లుకోగూడదా స్వామి? అందమైన ఆడవాళ్ళ నందరినీయాయనే Love చెయ్యాలా? భక్తురాలికి ముక్తి మార్గమంటూ గెద్ద లాగా తన్నుక పోవడమేనా యీాయనవంతు? భూలోకంలో రంభలంకరూ యీానసాత్తైనా?

స్వా. అంతా సర్వేస్వరుని మాయ నాయనా! నిమిత్తమాత్రులం మన చేతిలో యేముంది?

నే. ఈ మాయలు మంత్రాలు యిక సాగవు స్వామి! దేముడే యీాలా Over Love చేస్తుంటే మానవులం చూస్తూ ఎలా వూరుకుంటాం. దీనిపైన వాక దీర్ఘ వుపన్యాసం ఇవ్వమన్నా యిస్తాను మీాకభ్యతరం లేకపోతే, ఈక్షణంలోనే దేవునిపైన ఆయన సామ్రాజ్యంపైనWar Declareచేస్తున్నాను. మానవుడో దేవుడో యెవరో ఒక్కరే వుండాలి. నేను చచ్చినా లెక్కలేదు నాతర్వాతవారు చాలామంది నా వెనకున్నారు. పెండ్లి అయినవారు కాదులెండి. కాని వారు, నవయువకులు. అందమైన అమ్మాయిలను లవ్ చేసేవాళ్లు, ప్రేమ లేఖలు రాసేవాళ్లు, దేశంకన్నా ప్రేయసినే ప్రాణసమానంగా చూసే వాళ్ళు, ప్రేమలో నాలాగే దేముడితో పోటీపడి వోడిపోయిన వాళ్లు, వుత్తరాలు వ్రాసి ఆత్మహత్యలకు సాహసించేవారు చాలామందున్నారు. నేను చెప్పిన లక్షణాలన్నీ కలిగిన నవ యువకుల్లారా, నాగరికత తెలిసిన ఆంధ్రులారా! రండి నా వెనక నిలబడండి, లేక ముందు నిలబడినా సరే రండి! పోరాడండి! మనచెయ్యి జారిపోయిన మన ప్రియురాండ్రను స్వర్గ లోకంనుంచి లేకపోతే యేలోకంలో వున్నా సరే తిరిగి తెచ్చుకోటంకోసం యేకమై పోరాడండి! రండి! యువ ప్రపంచం నుంచి నేను War Declareచేస్తున్నాను. జై యువకలోకానికి!

స్వా. శాంతించు నాయనా!

యిక శాంతించలేను స్వామీ! యెందుకు శాంతించాలి! దేశ ప్రజల సౌఖ్యం కోసం సూయాజ్ కాలువను జాతీయం చేసిన యీజిప్టుపై యుద్ధానికి పోవద్దంటే పేరాశకు పుట్టినిల్లయిన బ్రిటన్ శాంతించిందా! ఆవేశాలకు అధికారమిస్తూ, పరస్పర వైషమ్యాలతో వొకరితో నొకరు పోటీపడుతున్న అమెరికా రష్యాలు అటంబాంబులు అరికట్టమన్నా, పరీక్షలు నిలిపివేయమన్నా, శాంతిస్తున్నాయా? నల్లజాతిని నాశనం చేయవద్దని యెంత బ్రతిమాలినా దక్షిణాఫ్రికా శాంతించిందా? అల్జీరియాకు స్వాతంత్ర్య మివ్వమంటే ఫ్రెంచి ప్రభుత్వం శాంతించిందా అంగీకరించిందా? దరిద్రాన్ని నిర్మూలించమంటే ధనవంతులు శాంతిస్తున్నారా? సానులంతా బజారుకొస్తే సన్యాసులు మాత్రం శాంతిస్తారా? నేనుమాత్రం యెందుకు శాంతించాలి? ఎవరిలాభం కోసం వారు, శాంతిని గోల్పోతుంటే నాప్రేయసి కొరకు నేను దేవుడితో యుద్ధం చేస్తాను. అంతు తేల్చుకుంటాను నన్ను ఆశీర్వదించండి స్వామీ! యీ రోజే "తెలుగునాడు" పత్రికకు నా ప్రకటనను పంపిస్తున్నాను. అన్నట్లు యీ సుందరాంగి మీ కేం కావాలి? (స్వామిలో చలనం కనుపించ లేదు. అలాగే కళ్ళప్పగించి చూస్తున్నాడు.) మీ కుమార్తె అనుకుంటాను. యీమె తల్లి గారు సజీవులై యున్నారా? చెప్పండి స్వామీ?

అంతా కరుణామయుని కృప!

మీ రెంత మూర్ఖులు స్వామి! కన్నతండ్రికి పుత్రికా శోకం కలిగించి, కానున్న భార్యను నాకు దూరం చేసి లోకంకాని లోకానికి యీ అప్సరసను దొంగలించుకొని పోయిన ఆ దేవునిపై యింకా మీకు యెంత భక్తున్నది స్వామీ! యీ మూఢభక్తి విడిచిపెట్టి నాతో కలసిరండి. యీ యుద్ధంలో సైనికులుగా చేరండి కదలండి!

స్వా. నీదంతా వొట్టి ఆవేశమే నాయనా! ఆడదాని మైకంలో అజ్ఞానమే నిన్ను బలంగా మాట్లాడించింది. ఆశ్రమ ధర్మాలను పాటించక అధిక ప్రసంగం చాలా చేశావ్ అవివేకివై పరమేశ్వరుని తూలనాడావ్ నీలాంటి మొరిగే కుక్కలు యీ ఆశ్రమంలో చాలా విశ్రమించి పోయినయ్, కరవలేక.

నే. (త్రుళ్ళిపడి) నేను వొట్టి మొరిగే కుక్కనా స్వామీ!

స్వా. గట్టిగా మొరిగే కుక్కవి. అంతే

నే. చివర కింతేనా మీరనగలిగింది?

స్వా. ఎక్కువన్నా నీకు గలిగేలాభం సున్న. ఆశ్రమ ధర్మం అర్ధం చేసుకొని ప్రవర్తించు. ఆశ్రమానికి కావలసింది శాంతికాని సమరంకాదు. తెలిసిందా?

నే. ఏమటి స్వామీ అంత తేలిగ్గా కొట్టిపారేస్తున్నారు నన్ను రాజకీయాలు తల్లక్రిందులు చేసేశాను సఘాన్ని యెంతో మరామత్తు చేశాను. ఎన్నో సత్యాగ్రహాలు చేశాను ఎన్నో నిరసన వ్రతాలు పూనాను. ఎన్నో ఆశ్రమాలు తిరిగాను ఎందరో స్వాముల వారి దర్శనం చేసుకున్నాను యెవ్వరూ మీరన్నంత మాటనలేదు. నా శక్తి సామర్ధ్యాలకు మెచ్చి ప్రభుత్వంనాకు పెద్ద వుద్యోగం యిస్తామన్నా నిరాకరించాను.

స్వా యిన్ని ధైర్య సాహసాలు కలిగిన వ్యక్తివి దెయ్యానికి జడిసి, స్పృహదప్పి యెందుకు పడిపోయ్యావ్?

నే. అదేస్వామి నాకు విచిత్రంగావుంది! ఆట బొమ్మనై పొయ్యాను అరవటానికికూడా శక్తి లేకుండా పోయింది. యింతకూ అది దెయ్యమేనంమరా? (లోనుంచి గెజ్జలశబం వినిపించింది. నేను బయటపడి స్వాములవారిని ఆనుకొని నిలబడ్డాను. వెంటనే దీపాలు ఆరి పోయినయ్. తడిమి చూచాను స్వాములవారు నాకు దూరమై పొయ్యారు.)

(భయంకొద్ది బిగ్గరగా) స్వామీ! స్వామీ! ఎక్కడున్నారు? చెప్పండి స్వామీ మరలా నన్ను దెయ్యంపాలు జేస్తారా? వొద్దు నేనిప్పుడే మావూరెళ్ళిపోతాను. నాకు పెళ్ళి వద్దు పెడాకులువద్దు నన్ను పోనీయండి స్వామీ! మీకునమస్కారం చేస్తాను. యేదో బుద్ధి గడ్డితిని మీతో యింతదూరం మా ట్లాడాను. క్షమించండి. నన్ను పెళ్ళనివ్వండి స్వామీ జై. ఆంజనేయ! వీరాంజనేయ!

(నాపలుకులు యెవ్వరికి యినిపించినట్లే లేదు. ఆచీకట్లో యెవరో వొస్తున్నశబ్దం వినిపించింది. దెయ్యమేనేమో అనుకొని అదిరి పడ్డాను. కొంతనిశ్శబ్దం తర్వాత లోనించి గొంతువినిపించింది)

ఎచి: ఎవరు వారు! స్వాములవారి కైంకర్యార్థమై వొచ్చారా లేక అమ్మవారి పాదపూజకై వేచియున్నారా?

రెండూ లేదు స్వామీ పరారు చిత్తగించడానికి సిద్ధంగా వున్నాను.

మూర్ఖుడా! నీతో మాకవుసరంలేదు. నోరు కదిపావంటే గొంతు తెగిపోతుంది.

లేదు నోరు మూసుకుంటాను.

తమరిరాకవలన మాఆశ్రమం పావనమైంది తమరినామధేయం?

నేనేనండి దాసును!

నీ నామం మాకుపవిత్రం కాదు మారు మాట్లాడక నేరుగా ముక్కుసూటిగా నడువ్......ఊ...రా......రా......

(నేను ఆలాగే నడన్తు వొగదిలోకి వెళ్లిపొయ్యాను. తర్వాత యేంజరిగిందో నాకు తెలియదు. నేను లోనుంచి హాల్లోప్రవే సించే టప్పటికి వోసుందరాంగి నవనవోల్లాసిని కంగారుగా అటూయిటూ పచార్లు చేస్తుంది. S I గారు తాపీగా టేబిల్ నానుకోని ఆమెను పరీక్షిస్తున్నాడు. నేను రాగానే ఆమెను చూచాను. ఆమె నన్ను చూచింది, చూడ్డమే తడువుగా)

ఆమె:— ఇదుగోనండీ నాభర్త ఈయనే మతిలేని మనిషి పిచ్చివా డన్నా పర్వాలేదు యిప్పుడొకమాట మరోనిమిషానికోమాట అసలు యీాయనగారికి జ్ఞాపకశక్తి శూన్యం చాలాభయస్తుడు అందులో పోలీసు వారంటే చెప్పనేలేం......ఆ చూపులు చూడండీ బెదిరిన జింకలాగ......

(యీామాట యెవరినో అంటున్నదని నేననుకున్నాను. యింత కూ ఆ అమ్మాయెవరో నాకు తెలిసి చస్తేగా! నేను నిజంగా బెదురు చూపుల్తో S I ని చూస్తున్నాను. S I. గారు చాలా భయంకరంగా చూస్తున్నాడు నన్ను. యిదంతా యేమిటో నాకు అర్థం కావడంలేదు.)

S I :... ఏయ్ నిన్నే! (నేను ఎవరినో అనుకొని లోపల వ్యక్తికోసం చూస్తున్నాను.

ఆ. ఏమండి మిమ్మల్నే! (నేను అప్పటికి యినిపించుకోలేదు.)

S I ఏయ్ Mr. — నిన్నే పిలవటం!

నే. కాస్త Moods లో కొచ్చి) నన్నా సార్!

S I నువ్వుగాక యింకెంతమందున్నారీయింట్లో! నిన్నే (గర్జించాడు)

నే. (అనూాయకంగా ఆ సుందరాంగివైపు జూచి) ఏమండీ నన్నేనా

ఆ అయ్యో భగవంతుడా యెంతపాపం చేసుకున్నానురా తండ్రీ ఈ పిచ్చివాడితో నేనెలా కాపురం చేసేది! వారు పిల్చేది మిమ్మల్నే

(నేను నిజంగా పిచ్చివాడినే అయిపొయ్యాను నాకు వీరికి యేమిటి సంభంధం? వొక్క మాటలో చెప్పాలంటే నేను అమాయక చక్రవర్తినై పొయ్యాను. S I మెల్లగా నన్ను సమీాపించాడు)

S I (నన్ను వురిమి చూస్తు) మీా పేరు?

నే దా సు......!

S I ఊరు

శే పల్లే!

ఈమె యెవరో మీకు తెలుసా?

తె. లి దు!

ఏమండీ! మీరు యింత పిచ్చివారై పొయ్యారేమండీ! మీ భార్యనుకూడా పోల్చుకోలేక పోతున్నారా? వోగంటక్రితం కాఫీ కాచియిచ్చానె...మీరు యెంతో ప్రేమతో పాటపాడమంటే పాడి వినిపించానే, త్వరలో మీకు జబ్బు నయమవుతుందని డాక్టరుగారు చెప్పారని మీకు చెప్పలేదు? నాఫోటో చూచుకుంటూ మీరు కన్నీరు కారుస్తుంటే నేను మిమ్మల్ని యింతగానో బుజ్జగించలేదూ? త్వరగా వస్తావా దుర్గా అంటే డాక్టరుని తీసుకొని క్షణంలో తిరిగొస్తానని మీవద్ద శెలవు తీసుకొని వెళ్ళాను కదూ? యింతలోకే మర్చిపొయ్యారా? క్షణ క్షణానికి మీజబ్బు ముదిరి పోతుందేమిటండీ. (బోరున యేడుస్తు) అయ్యో భగవంతుడా నాభర్తను నాకు దక్కనీకుండా చేస్తావా? నాకు పతి బిక్ష పెట్టవా స్వామీ!... (మొత్తుకుంటూ నా రెండుచేతులు గట్టిగా పట్టుకొని) ఏమండీ! యీలా చూడండీ నేను... మీ దుర్గను.. మీ భార్యను యిప్పటికైనా తెలుసుకున్నారా చెప్పండి వారు అడిగినదానికి సమాధానం చెప్పండి!

చూడండి దుర్గాదేవిగారు మీరు అనవసరంగా చాలాగొడవ చేస్తున్నారు. లేనిపోనివి కల్పించి ఆయన్ను చెప్పమని నాటక మాడుతున్నారు. మీవిషయం పూర్తిగా మాకు తెలుసు. దయచేసి మీరు అలా కుర్చీలో కుర్చుంటే చాలా సహాయం చేసిన వారవుతారు.

(చాలా దీనంగా) S I గారూ వారినేమి కంగారు పెట్టకండీ అసలే జబ్బుమనిషి, అందులో మతి స్థిమితం లేదు - మూర్ఛ

ఇలాంటి స్థితిలో మీ కేమి సమాధానమివ్వగలడో చెప్పండి. దయచేసి......

S I దయచేసి మీరు అయిదు నిమిషాలు రాద్ధాంతం కట్టిపెట్టాలని కోరుతున్నాను.

ఆ. మీకు హృదయం లేదా?

S I ఈ ప్రశ్నతో ప్రతిఒక్కరూ పోలీసుల్ని హడలగొడ్తూవుంటారు పోనీ నాకు హృదయమే లేదనుకోండి!

ఆ. [కొంచెం కఠినంగా] ఎప్పుడో అనుకున్నాను.

S I That's Good Mr. దాసు!

నే. [అంటెన్షన్‌లో] Yes Sir!

S I మీరు భయపడకుండా చెప్పండి. మీకు యే ఆపదవచ్చినా నేను కాపాడతాను. యిప్పుడు మీకొచ్చిన ప్రమాదమేమీ లేదు

నే. [భయాందోళనతో] ఏమిటి సార్ యిదంతా?

ఆ. ఏముంటుంది? పోలీసు జులుం.

నే. జులుమా?

ఆ. కాకపోతే మరేమిటి? ఆడది కాస్త నాగరికతగా ప్రవర్తిస్తే చాలు తరుముకొస్తారు రిక్షావాడు మొదలు పోలీస్ ఇన్స్పెక్టరు వరకూ ఆరాలు తీయడానికి.

నే. ఎందుకూ?

ఆ [చిరాగ్గా] ఎందుకేమిటి నాఖర్మ! అవకాశం దొరికితే ఆనందించడానికి. అయినా యీ దేశంలో యింత ఆడపిచ్చి పుట్టిందేమిటి? [నన్నుచూస్తు] యింట్లోవుంటే మీ పోరు బయటపడితే వీళ్ళ...పోరు.

S I శ్రీమతి దుర్గా దేవిగారు?

ఆ. అంత గౌరవానికి మేము నోచుకోలేదులెండి

[వ్యంగంగా] నాగరికత తెలిసిన నారీరత్నంకదూ మీరు ? చూడండి నా జీవితంలో ముఖ్యంగా నాసర్వీసులో మీలాంటి రత్నాలను చాలామందిని చూశాను. నీకన్నా మహా తెలివిగా మాట్లాడిన వారిని యీచేతుల్లోనే అరెష్టుచేసి న్యాయస్థానములో హాజరు పర్చాను. బుకాయింపులు కట్టిపెట్టి అయిదు నిమిషాలు కదలకుండా ఆ కుర్చీలో కూర్చోండి. [జబర్దస్తీగా] కూర్చుంటూరా లేక అరెష్టు చెయ్యమంటారా ?

[కంగారుగా] కూర్చుంటాను. [కుర్చీలో కూలబడింది].

ఊ! మిస్టర్ దాసు ! యీామె యెవరో మీకు తెలుసా ?

[అమాయకుడిలా] నాకా !

[గదమాయిస్తు] నీకే !

[తత్తరపాటుతో] తెలీదు !

ఏమండి సర్వేస్వరుని సాక్షిగా చెప్పండి. నన్ను మీారెరుగరా? మీా భార్యనే మీారు మర్చిపొయ్యారా ? వొక్కసారి ఆఫోటో చూచి నన్ను పోల్చుకొని చెప్పండి.

రిహార్సిల్సు నేర్పిస్తున్నారా ?

కాదండి !

[ఘర్జిస్తు] కాకపోతే చెప్పవేం ? ఎవరామె? ఆమెకు నీకు ఏమి సంబంధం.

[తడబడుతూ యేమి చెప్పాలో తెలియక అమాయకుడిలా ఆమె వైపు చూచాను].

ఆమె ముఖం ఎందుకు చూస్తారు ? నాముఖంచూచి చెప్పండి

[కొంచం కంగారుగా] ఎందుకండి వారినలా గదమాయిస్తున్నారు ? ఆయన వాలకం చూస్తుంటే కనిపించటంలేదు మతిలేని మనిషని ? మీా యిష్టంగా దబాయించారంటే ఆయనకు పిచ్చి ముదురుతుంది.

పర్వాలేదు ఆసుపత్రిలో చేర్పిస్తాం !

ఆ. Thanks! ఆమాత్రం తెలివి పోలీసు వాళ్ళకే కాదులెండి మాకూ వుంది!

S I ఉండబట్టేగా బ్రహ్మాండమైన నాటక మాడుతున్నారు (కసిగా) Mr దాసు అడిగినదానికి సమాధానం యివ్వకుంటే మీరుకూడా జైల్లో కాపురం పెట్టాల్సివుంటుంది!

నే. యిప్పుడు బయట వుంటేమాత్రం నేను చేసేదేముంది సార్!

S I What Do you Mean!

నే. అంతేసార్ యింకేమిలేదు!

S I అయితే మీరు చెప్పరన్నమాట?

నే. నాకేమి అర్థం కావడంలేదుసార్!

ఆ. అసలు వారి కర్థమైతేగా, అర్థమున్న ప్రశ్నలడగటానికి?

S I (ఆమెను వురిమి చూచాడు) అర్థమయ్యేట్టు చేస్తాను కాస్త వోపిక పట్టండి. Mr దాసు యీమె మీ భార్య అంటుంది. మీరేమంటారు?

ఆ. అయ్యో ఖర్మ భర్త భార్యను యేలా కాదంటాడండి! మీరు అడగడంకూడా చాలా విడ్డూరంగా వుందే! (నన్ను చూచి) చెప్పరేమండీ? చెప్పండి!

నే. (పూర్తిగా మతిలేని మనిషినైపోయ్యాను) ఆ! చెపుతున్నాను: ఏమని చెప్పాలి.

అ. వారి ప్రశ్నలకు సమాధానం చెప్పండి.

నే. ఏమి చెప్పమంటారో అడగండిసార్!

S I యదార్థం చెప్పండి మీకు బహుమతి లభిస్తుంది. లేకపోతే జైలు ప్రాప్తి.........

నే. అంతపనొద్దులెండిసార్ యేదో ఆ బహుమానం సంగతేడగండి చెప్పేసి వెళ్ళిపోతాను.

ఆ. అయ్యో మీకు బహుమానాలకేం తక్కువలేండి! మనింట్లో లేవా కావల్సినన్ని బహుమానాలు కావల్సుంటే యినపెట్టె

తాళాలు మీకే యిచ్చేస్తాను. మీ యిష్టంవచ్చినట్లు చేసుకొండి ఖర్చుపెట్టుకొండి బోలెడాస్తి మనింట్లోవుండగా వీరి బహుమానాలు పుచ్చుకొనే ఖర్మేమిటండీ మనకు? మీరు చెప్పండి. నేను మీ భార్యనుకానా?

(ఆశ్చర్యంగా) మీరా!

అవునండి నే నే మీదుర్గను!

నా దుర్గవా!

అయ్యో భగవంతుడా యింకనేనేం చేసేది (నా చెయ్యి పట్టుకొని తనఫోటోవద్దకు తీసుకొనిపోయి) యీ ఫోటో చూచి చెప్పండి. యీ ఫోటో మీరు దగ్గరుండేగా తీయించింది.

నేను దగ్గరున్నానా?

Nonsence మీరాయన మనస్సును మరీ పాడుచేసేస్తున్నారు! ఎప్పుడో పాడైపోయింది. మీఅఘాయిత్యం చూచి మరీపాడైపోయింది. (నావైపుతిరిగి నా చెయ్యి విడిచి పెట్టకుండా అతి దీనంగా చూస్తూ) ఏమండీ యిప్పటికైనా మీమనసు మారలేదా! పోనీ నేను మీ భార్యను కానని చెప్పండి ఆజైల్లోనే క్రుళ్ళి క్రుళ్ళి చచ్చిపోతాను. చివరకు నా బ్రతుకింతేననుకుంటాను (కన్నీరు తుడుచుకుంటూ) అంతకన్నా యింకేం చేస్తాను. యేదో వొకటి తేల్చి చెప్పేయండి!

ఏమని చెప్పాలో చెప్పండి.

అదికూడా నేనే చెప్పాలా? యింత చెప్పినా మీకర్థంకాలేదా

ఏలా అర్థమవుతుందండీ మీలాగా నాటకమాడడం ఆయన చేత కావడంలేదు పాపం! చూడండి దాసుగారూ మీరు మద్రాసులోనే వుంటున్నారా?

లేదండీ!

మీరెప్పుడొచ్చారిక్కడికి?

ఓ అరగంటయి వుంటుందిసార్!

SI మీరొచ్చిన కార్యం

నే నాకర్థం కావడంలేదు సార్!

SI మీరేపనిమీదొచ్చారు?

నే. పెండ్లి కార్యంపై!

SI మీ కేనా......వేరే......!

నే. యింకెవరూ లేరండీ నాకోసమే నాకెనండీ పెళ్ళి!

SI అమ్మాయినిస్తా రేనా?

నే. ఈ యింటి అడ్రసే యిచ్చారండినాకు!

SI అమ్మాయిని చూచారా?

నే. ఎక్కడిదిసార్! అమ్మాయిని చూడలేదు కానీ వొక చావు గండాన్ని మాత్రం తప్పించుకోగలిగాను!

SI యిక్కడేనా?

నే. అవును సార్ యీ ఆశ్రమంలోనే వో పెద్ద దెయ్యం బారినుంచి బ్రతికి బయట పడ్డాను. మీరు రాబోయే ముందుకూడా ఆదెయ్యమే యీ యింట్లో దీపాలన్నీ ఆర్పి నన్ను అమాంతం ఆ గదిలోకి లాక్కెళ్ళింది.

SI ఓహో! యీ ఆశ్రమంలో మీకు దెయ్యాలుకూడా యెదురైనాయన్నమాట?

నే. ఎదురవటమే కాదుసార్ జబర్దస్తీగా నన్ను దోపిడీ చేసేసింది!

SI What?

నే. సత్యంసార్ నా బెడ్డింగు, సంచి, జేబులో 300 వందల రూ॥ నాకే తెలియకుండా మాయంచేసేసింది!

SI తర్వాత?

ఆ. మతిలేకుండా ఆయనేదో వాగుతూవుంటే కట్టు కథలా మీరు కూడా వింటున్నారేంటి? బాగానేవుంది మీ చాదస్తం యేమండీ మీరు దయచేసి కాస్త నోరు కట్టండి. మీకు పుణ్యముంటుంది.

దుర్గాదేవిగారు నాగరీకతలో పేరుమోసిన మీకు యిదంతా కట్టుకథలాగే వుంటుంది. రెండునిమిషాలోపిక పట్టండి కట్టుకథ పచ్చికథలా మీరేవొప్పుకుంటారు. Mr దాసు మీరుచెప్పండి. యింతకూ మీరా అమ్మాయిని చూచారా!
(ఆమెనుచూచి సందేహిస్తూ, ఆమె ఫోటో వైపుతిరిగిచూస్తూ) మనిషిని మాత్రం చూచాననుకోండి... కాని... యీమె పర మాత్మలో లీనమయిందని... స్వాములవారు సెలవిచ్చారు... అంటే......!
(దీనంగా) యికతంటే...ఏముండి యెప్పుడో జరిగిపోయిన పాత విషయాలను తిరిగి పైకి లాగడం యెందుకు చెప్పండి వీ:రి మూలంగా యెవరికీ యేమిలాభముండదని మీకు తెలిసికూడా ......మీరు మతితప్పి మాట్లాడుతున్నారు. పోనీ యిప్పుడు చెప్పండి...యీ కథంతా జరిగిపోయినతర్వాత మీరు నన్ను వివాహం చేసుకోలేదా?
(దిగ్భ్రమ చెంది) నేనా?
అవునండీ మీరే.........(తన వ్రేలి వుంగరాన్ని చూపిస్తు) యెన్నటికీ మరపురాని ప్రేమకానుకగా యీ వుంగరాన్ని నాకు బహూకరించింది మీరేకదూ?
నేను మీకు వుంగరం బహూకరించానా?
తెల్లచీరెలు నాకెంతో అందంగా యుంటాయని- నేను హంస లాగా మీకంటికికనిపిస్తానని యీ తెల్ల సిల్కు చీరె మీరేగా నాకు తెచ్చిపెట్టారు.
(నన్ను నే నే నమ్మలేని స్థితిలో పడిపోయ్యి) నేను సిల్కుచీరె కొనియిచ్చానా?
అవునండీ (తను కట్టుకొన్న చీరెను నాకు చూపుతూ) యీ తెల్ల చీర?
(మెడలోని లాకెట్ను చూపిస్తు) ఈ లాకెట్ను కొనిపెట్టిం దెవరు? ఈ తాళి కట్టిందెవరు? చెప్పండి......(పాదాల

పై బడి) మీపాదాలు తాకి బ్రతిమాలుకుంటున్నాను.— అన్యాయం చెయ్యకండి... నేను మీ భార్యనుకానా? నేను మీ దుర్గను కానా... చెప్పండి యిప్పుడే మీపాదాలముందే ప్రాణం విడుస్తాను.

నే. (యిదంతా నాటకమని తెలుసుకున్నాను. నేను ప్రస్తుతం హీరోనయ్యాను. ఆలాగే నటించాలని మెల్లగా ఆమె తల నిమురుతూ) పిచ్చిదానా యీమాత్రానికే యింత కన్నీరు కార్చాలా? అనవసరంగా యెంత water వేస్టయిందో తెలుసుకున్నావా? ఆఁ! యినస్పెక్టరుగారూ యేదో పాపం యింతదూరం చెప్పుకుంటూవుందికదా తనునాభార్యనని పోనీ నమ్మండి! మీకొచ్చిన నష్టమేముంది? నమ్మండి—నమ్మండి!

S I Mr దాసు! మీరు ప్రమాదాన్ని కోరి తెచ్చుకుంటున్నారు.

నే. పోనివ్వండి వొకరి పరువు కాపాడినవాడినౌతాను.

S I దుర్గంటే సామాన్యురాలుగాదు నిప్పులాంటి మనిషని పోలీస్ రికార్డులోవుంది.

నే. నన్ను వుప్పుని రాసుకోండి-అంతకన్నా యేంచేస్తాం!

S I మద్రాసులో పేరుమోసిన దగాకోరు. పచ్చి వ్యభిచారిణి!

నే. ఆమెకు నేను భర్తను అంటేకదండి S I గారు! (ఆమెతో) యేమండీ దుర్గాదేవిగారూ...

ఆ. (చాలా చనువుగా నా నడుంచుట్టుకొని) నన్ను అంత మర్యాదగా పిలవకండీ నేను మీ భార్యనుకానా!

నే కాదనటంలేదు. అయినా నాకొక సందేహం యింతకూ నేను మీకు యెన్నో నెంబరు భర్తను?

ఆ. (నన్ను విడచి దూరంగాకదిలి) ఆదేమిటండీ ఆలాఅంటున్నారు!

నే. ఆధారంకోసం అడుగుతున్నాను. రేపు కోర్టులో చెప్పాలిగా!

ఆ. ఆడవాళ్ళకు (ఎంతమంది) భర్తలుంటారేమిటి!

S I నాగరికత సద్ధరించడానికి యెందరైనా వుంటారు.

(చిరాగ్గా) మధ్య మీరెందుకండీ మాట్లాడడం? భార్యా
భర్తలం మేమేలాగైనా మాట్లాడుకుంటాం మీకెందుకు?
అలా అనకూడదు. నేను మీకు భర్తనైనప్పటినుంచి వారిక్క-
డేయున్నారుగా. వారుగూడా యిక్కడ అర్జీ వుంచాలను
కోవటంలేదు. వారికి బోలెడన్ని పనులుంటాయిగా బయటా
నా నెంబరు తెలుసుకొని పోతామని వారు కాచుకొనున్నారు.
నెంబరేమిటండీ!
అంటే నేను మీకు యెన్నో నెంబరు భర్తనో... తెలిపితే
పాపం వారు రాసుకొనిపోతారు. అంతేనంటారా సార్!
మొత్తానికి మీరిద్దరూ చాలా విచిత్రమైన వాళ్ళుగావున్నారు
లేకపోతే యింత చరిత్ర అతి త్వరలో యేలా సాధ్యపడుతుంది
సార్! యిదంతా సినిమావాళ్ళ Understandings లెండి!
సరే మీ యిద్దరినీ అరెస్టు చేస్తున్నాను.
యింట్లోనా జైల్లోనా సార్!
వల్లకాట్లో అంతా తర్వాత తెలుస్తుంది. ముందు నావెంట
నడవండి.
ఇంతకూ జైలుకేనంటారా సార్?
ముమ్మాటికి అక్కడికే!
హతోస్మి! రక్షించారు. మేముచేసిన నేరమేమిటి సార్!
వ్యభిచారాన్ని ప్రోత్సహించడమే!
అది మద్రాసులో మామూలుగాసాగిపొయ్యే వ్యాపారమేగదు
సార్ అందులో కొందరు సినిమావాళ్ళకు యిదొక సీజనల్
బిజినెస్‌సార్! యిక షావుకార్లమాటకొస్తే యిదొక హాబి అనే
చెబుతారు. పోతేస్టూడెంట్సు విషయం మీకు చెప్పేదేముంది.
చాలామందిని చూసేవుంటారు. అంతా లైలాలు, మజ్నూలే
కనిపిస్తుంటారుమీకు. అసలుమీకు ఒక్కమాటలోచెప్పాలంటే
యిదివొక అంటువ్యాధిలా మన జాతినంతా అల్లుకొని చివరకు

అంతైతే యింత్తై దీర్ఘ కష్టంపు లాగా వ్యాపించింది. వొక్క మాటత్తో పోమ్మంటే పోతుందా! ఎంకరి కొంపలార్పాలో ఎన్ని మిద్దెలు ఆకాశాన్ని తాకాలో...యిందులో చాలా విషయాలున్నాయ్ సార్ మీరుగూడా తెల్సుకోవాల్సినాటివి పర్వాలేదులెండి ప్రభుత్వం త్వరలోనే చట్టాన్ని తెచ్చి అమలు పర్చబోతుందని యీమధ్య పత్రికల్లో గూడా చూశాను అది రానివ్వండి చూచుకోవచ్చు. ఈలోగా మీకెందుకు సార్ యీతిప్పలు, మొఖమాటాలూను అందరికీ మీరు కంటకంగా యెందుకుండాలి చెప్పండి! ఏదో చూచి చూడనట్టు పోతే సరి యిన స్పెక్టర్ గారంటె చాలా వుదారుడని అందరూ వొంగి వొంగి సలాం చేస్తుపోతారు.

S I ఏం Mr. దాసు—మద్రాసుకు రావటం క్రొత్తని చెబుతూ మరో వైపు మద్రాసు అనుభవాల్ని తూచినట్లు చెప్పేస్తున్నావే? ఎంతకాలంనుంచి బ్రోకరుగా పనిచేస్తున్నావ్?

నే వ్యభిచారానికి వొక్క మద్రాసేందుకుసార్ దేశంలో యే మూల చూచినా యిదే కంపు నా జీవితంలో నేను పరస్త్రీని కన్నెత్తి చూడలేదంటే మీరు నమ్ముతారా? ఆమాటకొస్తే మిమ్మల్ని నేను నమ్ముతానా చెప్పండి?

S I (తీవ్రంగా) Shut up! హద్దుమీరి మాట్లాడుతున్నావ్?

నే. అసలు మన నాగరికతకు హద్దులుంటెగదంటసార్? లోకం పోకడయిలా వుంది అని చెప్పాను—దానికే మీరు మండి మండి పోతున్నారు!

S I అయితే వ్యభిచారాన్ని సమర్థించమంటావా? పుస్తెకట్టిన భార్య పస్తులతో మాడిమట్టిలోకలిసి పోవాలంటావా? సంసారాలు, స్మశానాలుగా మారిన సానివృత్తిలోనే సుఖముంటుందంటారా? అందాన్ని చూపించి అందరికీ శరీరం తాకట్టు పెట్టి డబ్బు సంపాయించటమేనా మీవృత్తి? దీన్నేనా మీరు

నాగరికతని పిల్చేది ? డబ్బు కావాలంటే కష్టపడి పని చెయ్యండి యెవరు కాదంటారు ?
దొంగతనం చేస్తే ?
బొమికెలు విరగతంతారు ?
ఆ దెయ్యం నా దగ్గర 300 రూపాయలు కాజేసింది. అదీ గంట క్రితం. ఆ దెయ్యం బొమికెలు విరవండి చూస్తాం ?
ఆ విషయం తర్వాత చూస్తాం. ముందు మీరునడవండి !
రావాల్సిందే నంటూరా ?
(మేమిలా మాట్లాడుకుంటూవుండగా యెవరో వొక వ్యక్తి చాలా హడావిడిగా కొంప మునిగిపోయినవానిలా పరుగెత్తు కుంటూ వొచ్చాడు. మనిషి నాజూగ్గానే వున్నాడు. కోటు, సూటు, హాటు తగిలించి కంటికి అద్దాలు పెట్టుకొని, చేతిలో వొక తోలుసంచి పట్టుకొని, మెడకొక స్టెతస్కోపు తగిలించు కొని వున్నాడు. రాగానే హడావిడిగా అందరివంకా చూశాడు. యితన్ని చూడగానే యెవరో డాక్టరని నాకు బాగా అర్థమై పోయింది. మనిషి చాలా తొందరలో వున్నాడు కాబోలు రాగానే )

Hallow Miss Durga devi, What happened? evening హాస్పిటల్ కొచ్చారట? Oh S I గారా! మీరూ యిక్కడే వున్నారన్నమాట ?
(డాక్టర్ను చూడగానే అమాంతం కళ్లు పైకి నిలబెట్టి మూర్ఛ పడి పోతున్నదానిలా) డాక్టర్ గారూ ! డాక్టర్ గారూ ! (పడి పోయింది).
ఆహా ! జాగ్రత్త ! కాస్త మెల్లగా పడండి ! (ఆమెను నేను అమాంతం పట్టుకొని సోఫాలో పండబెట్టాను) That's right Well done! ముందు కొంచెం water తీసుకోండి ! (నేను అమాంతం లోపల పరుగెట్టాను. యీలోగా డాక్టరుగారు

స్టెతస్కోపుతో ఆమె గుండెను, నాడిని పరీక్షించి చూస్తు న్నారు. S I గారు మాత్రం యేమీ చెలించకుండా ఆమె లోని లక్షణాలను కనిపెడుతూ వున్నారు. నేను నీళ్లు తీసుకొని, స్వాములవారిని వెంటబెట్టుకొని తొందరగా వొచ్చాను. ఆమెలో చలనం యేమాత్రమూ కనిపించలేదు.)

స్వా. శ్రీ ఆంజనేయా! జై ఆంజనేయా! కాపాడుతండ్రీ! వోవాయు పుత్రా!

డా. (ఆమె ముఖంపై నీళ్ళు చల్లుతూ) dont worry I say! మీరేమి గోలచెయ్యకూడదు. ఆమెకు రెష్టుకావాలి!

S I ఆమెకిప్పుడు రోగమేమిటి డాక్టర్!

డా. (S I ని క్రిందకు పైకి చూచి) దాంతో మీకవుసరంలేదు!

S I అవుసరముంది డాక్టర్!

డా. అయితే మీరే తెలుసుకోండి!

S I కోప్పడకండి డాక్టర్! యిదిచాలా యింపార్టెంట్. అందుకో సమే అడుగుతున్నాను.

డా. (నాడి పరీక్షించటం పూర్తిచేసి) Oh'I see! she is seriously effected! చాలా ప్రమాదంగావుంది కేసు!

స్వా. ప్రమాదమా! అయ్యో శ్రీ ఆంజనేయా! జై ఆంజనేయా! డాక్టర్ గారూ యీఅపాయకరమైన స్థితిలో ఆ శ్రీఆంజనేయులే మిమ్మల్ని స్వయంగా యీ చోటుకు పంపించారు. లేకపోతే మాఅమ్మాయి పరిస్థితి యేంకాను?

S I ఈవిడ మీకేమవుతుంది?

స్వా. మా ఆశ్రమవాసి!

నే. మీ సహవాసా?

స్వా. ఆ మహేశ్వరుని చరణదాసి!

నే. అయితే యిది కామ పిశాచే!

(ఆత్రంగా ఆమెను సమీపించి, శరీరమంతా తడిమిచూచాడు. తనలో యేదో కంగారుగా కనిపిస్తువుంది) డాక్టర్ చూస్తా)
డాక్టర్! వెంటనే ఇంజెక్షన్ యివ్వండి! మీకు యెంత ఫీజైనా చెల్లించుకుంటాను.
శ్రీ ఆంజనేయ దండకం చదవండి సమస్త శక్తులూ సమూలంగా నాశనమవుతాయ్.
(కొంచెం కరుకుతనం చూపిస్తు), భగవంతునితో పరాశికాలాడకు నరకానికి పోతావ్.
ఇప్పుడు మేమేదో స్వర్గంలోవున్నట్టు?
ఉద్దండ, ప్రచండ, వీరభాహువుడు, వీరబలమారుతినే ధూషిస్తున్నావా? ఎంత అహంకారం?
మీరు అనవసరంగా స్టంట్సు కొడుతున్నారుకాని-నేను భగవంతుని ధూషించటం లేదుస్వామీ పూజించమంటున్నాను!
అదిమాయిష్టం! మా స్వేచ్ఛ! దేమునిగురించి మాట్లాడటానికి యీ ఆశ్రమంలో నీకధికారంలేదు!
ఓహో! దేమున్ణి మీరు దత్తు తీసుకున్నారా స్వామీ!
చూచారా S Iగారూ యితని నాస్తిక ప్రలాపాలు?
వారు చూడటంలేదు వింటున్నారు స్వామీ!
(గ్లాసులో యేదో మందుకలిపి ఆమె నోట్లో పోస్తూ) మీరు యీలాగే గొడవచేస్తూవుంటే యీమె సాంతం చచ్చి వూరుకుంటుంది. Pleasee Silence! కేసు చాలా సీరియస్!
రికార్డు చేసుకోమంటారా డాక్టర్ గారూ!
చేసుకోండి! What? What? రికార్డు చేసుకుంటారా! Why?
నా సమక్షంలో నేను Enquiry చేస్తుండగా యీ విపత్తు సంభవించినట్టు యీ కేసును రికార్డు చేసుకుంటాను!
Enquiry చేశారా?
అవును యీమె యిద్దరు భర్తలకు విడాకులిచ్చి, పైకి పెద్ద సినిమా తారనని చెప్పుకుంటూ పడుపు వృత్తితో పొట్టపోసు

కంటూవుందని, దీనికంతా యీ పుండరీకాశ్రమం కేంద్రంగా వుందని మాకు రిపోర్టులొచ్చాయ్. యీమె చాలా మందిని మోసం చేసిందట. ప్రక్కనున్న ప్రతి వ్యక్తిని తన భర్తని చెపుతూ పోలీసుల్ని తప్పించుకొని తిరుగుతూవచ్చింది. ఈరోజు లో గంటక్రితం వొక హోటల్లో నాకంటపడింది. నాప్రశ్న లకు వొక్క సమాధానము యివ్వలేదు. తనభర్త యింటిలో వున్నాడని చూపిస్తానని తీసుకొచ్చింది. (నన్ను చూపిస్తు) యితన్ని తన భర్తగా చెప్పింది. ఆయనచేతగూడా ఆమాట పలికించాలని చాలా నాటకమాడింది. నా Enquiry లో యిదంతా బూటకమని తేలిపోయింది. యిద్దర్ని అరెష్టుచేసి తీసుకెళ్ళేసమయానికి మీరొచ్చారు. తర్వాత జరిగిన కథ మీరేచూచారు.

స్వా. అరెష్టు చేసారా!

డా. వీళ్ళయిద్దర్ని అరెష్టు చేసారా?

S I అవును.

డా. (స్వాములవారితో) వేడి పాలేమైనావుంటే వెంటనే తీసుక రండి (స్వామి పాలకు వెళ్ళిపోయాడు) డాక్టరు నన్నుచూపిస్తు) యితను ఆమె భర్త కాదని మీకేలా తెలుసు.

S I అతని దోరణి తెలియజేసింది!

డా. ఏమని!

S I అతను ఆమెకు భర్త కాడని.

డా. You are completely mistaken! యితను ముమ్మాటికి ఆమె భర్త! I will challenge that!

నే. (ఆశ్చర్యంగా) డాక్టరుగారూ!

డా. Shut up మీ విషయం నాకంతా తెలుసు. మీరు యెన్ని రోజులనుంచి యిక్కడుంటున్నారో నాకు తెలుసు... మీకు మతి చెలించి పిచ్చిగా మారిందని యీ మద్రాసంతా

తెలుసు. నేనుమీకు రెండుమాసాలనుంచి since two months మందిస్తున్నాను మీజబ్బు యింతవరకూ నయం కాలేదు అయి నట్లై వుంటుంది మరలా తిరగబెడుతుంది. మీకు మూర్ఛరోగం కూడావుందని పాపం S I గారికి తెలీదుకాబోలు యిన్ని అవ లక్షణాలు అనారోగ్యం మీలోవున్నప్పటికి మీరంటే దుర్గా దేవి ప్రాణం విడుస్తుంది మీకోసం యెంత డబ్బు కర్చుపెట్టింది యీరోజున రమారా ఫీజులకే రెండు వేలు మీ మందులు రెండువేలు special treatment కోసం మరో వెయ్యి మొత్తం అయిదు వేలు ఖర్చయినా అనుదినమూ మీ ఆరోగ్యాన్ని ఆందోళనే...మీధ్యాన్నంచేయడంమినహా ఆమెకు యితరత్రమైన ఆలోచనలే లేవు. అలాంటప్పుడు ఆమె మీ భార్యకాదని చెప్పడానికి మీకేమది కారముంది ? (S I ని చూచి) దీన్ని రికార్డు చేసుకొని కేసు బనాయించి, వీధిలోకి లాగటానికి మీకే మది కారముంది ?

(తీవ్రమైన జ్వరంతో బాధపడుతూ స్మారకంలేక ప్రలాపించే రోగిలా) ఏమండీ చెప్పండి... మీ పాదాలు పట్టుకొని వేడుకొంటున్నాను. నన్ను దూరం చెయ్యకండి...నేను మీ మీ భార్యనుకానా? నేను మీ దుర్గను కానా? చెప్పండి... యీక్షణమే యీ ప్రాణం విడుస్తాను.) యీమాటలు పలికి మరలా స్మారకంలేకుండా పడిపోయింది డాక్టరుగారూ, నేను S I గారు, ఆమెను సమీపించాం. డాక్టరుగారు ఆమె నాడిని మరలా పరీక్షించి చూచాడు!)

High Fever...యిప్పట్లో యీమెను కదల్చడానికికూడా వీల్లేదు కదలితే ప్రాణానికే ముప్పు అందులో Delirium కూడా ప్రారంభమయింది. వెంటనే యీ కేసును Take up చేస్తున్నట్లు నేను రికార్డు చేస్తున్నాను!

అయితే పేషంటుని ఆస్పిటల్ చేర్పించండి !

టెంపరేచర్ తగ్గందే రోగిని కదల్పడానికి వీల్లేదు.
టెంపరేచర్ యెంతుందండీ ?
High Temparature!
నిజంగానా ?
యిన్స్పెక్టరుగారూ నేను మెడికల్ ఆఫీసర్ని!
తెలుసు!
యీ కేసు మంచి చెడ్డలగురించి మీ కేం తెలుసు ?
అందుకే మిమ్మల్ని అడుగుతున్నాను!
ఆమాటకే నేనూ సమాధానం యిస్తున్నాను.
ఆమెను కదల్పడానికి వీలులేదంటారా ?
ఆమె బ్రతకాలనుకుంటే ఆలాగే విశ్రాంతి తీసుకోవాలి!
డాక్టరుగారూ మరి నేను బ్రతకాలంటే...?
Strong Medicine Use చెయ్యాలి!
అవును చాలా Strong Medicine Use చెయ్యాలి. ఆమందు నాలో యేలా పనిచెయ్యాలో తెలుసా అపవాదులకు పెట్టి పుట్టిన అన్యాయపు అంతఃకల్ని అమాంతం గొంతుపిసికి చంపే లాపనిచెయ్యాలి. అసలు రోగియెవరో, రోగమేమిటో తెలుసుకోకుండా అంకతవశగా ప్రవర్తించే పిచ్చి డాక్టర్లను వొక్క గుద్దుతో గ్రుడ్లు పిటకొచ్చేలా చెయ్యాలి. అంటే పైకార్యాలు చెయ్యడానికి తగిన గుండెబలాన్ని, నరాల స్తోమతను మీ మందు యిచ్చేలా వుండాలన్నమాట ఆలాంటిమందేయిస్తారా?
My God! యితనికి పిచ్చిముదిరే ప్రమాదంకూడా కనిపిస్తుంది. (S I తో) వింటున్నారా ? తెలివికలిగిన మనిషి యిలాగేనా మాట్లాడుతాడు? యితనికి కచ్చితంగా పిచ్చేనండి ఆలా సర్టిఫికేటు వ్రాపివ్వమన్నా వ్రాసిస్తాను.
నాపిచ్చికి మీరు సర్టిఫికేట్ యివ్వడమేంటిగాని......మీ పైత్యానికి మందు నాదగ్గర సిద్ధంగావుంది యివ్వమంటారా ?

(S I తో) చూచారా మాటకు మాట. యివన్నీ పిచ్చి లక్షణాలే. యిది ముదిరిందంటే మన ప్రాణాలకే ప్రమాదం పైగా యితని ఆపరిస్థితిలో మూర్ఛ గూడా వచ్చేస్తుంది.

(నాకు కొంతకోపం వొచ్చింది) నాకు పిచ్చి ముదిరి మూర్ఛ వొస్తే-మీకు పైత్యంముదిరి మెదడంతా ఖాళీ అయిపోతుంది.

(S I తో) చూచారా నాకు పైత్యమట !

చూచారా నాకు పిచ్చట !

నేను చాలంజి చేస్తాను మీరు పిచ్చివాడని !

నేను గొంతెత్తి అరుస్తాను మీరు ఘరానా పైత్యకారని !

నేను యిప్పుడే Deside చేస్తున్నాను మీరిద్దరూ పిచ్చివారని డాక్టర్ గారూ మీ వాదంలో యదార్థంచాలాని గూఢంగావుంది. నేను యిందులో యెవ్వరినీ నమ్మలేక పోతున్నాను. కాబట్టి యీ కేసును తప్పకుండా రిజిస్టర్ చేసుకొంటున్నాను.

Mr దాసు మీరు నాతో రావాలి.

నేనెందుకండీ ? నా స్టేట్ మెంటు యిక్కడే యిస్తాను రికార్డు చేసుకోండి.

నేను Certify చేస్తున్నాను. యితను పిచ్చివాడని యితని స్టేట్ మెంటు చెల్లదు. దుర్గాదేవిగారితరఫున నేను సాక్షమిస్తా యీమాటే నేను కోర్టులోగూడా చెపుతాను.

డాక్టరుగారూ దుర్గాదేవిగారికి మీరు యెన్నో నెంబరు భర్తండి ఆ నేనేమైనా డైరీలో వ్రాసుకున్నానా పాడా ? (తన తప్పు గ్రహించి ఆగ్రహంతో) What? What is your Question?

దుర్గాదేవిగారికి మీరు......

You are insulting her ! ఆమె వ్యక్తిత్వాన్ని, నడవడికను మీరు అవమానిస్తున్నారు. ఆమెకున్న పలుకుబడిని మీరు పోస్టుమార్టం చేస్తున్నారు. ఆమెతరఫున కేసుపెట్టి మిమ్మల్ని కోర్టుకు లాగుతాను.

నే. అయితే యీాలోగా మిమ్మల్ని గూఢా వొకటి లాగమంటారా?

ఢా. లాగండి మీాకు ధైర్యముంటే చూస్తాం?

నే. నాధైర్యాన్నే మీారు చూడదల్చుకుంటె యిదో చూడండి (బలంకొద్దీ ఆయన మొఖంమీాద వొ(గుద్దుగుద్దాను. దాంతో ఢాక్టరుగారు దిమ్మదిరిగి మూడురౌండ్లుతిరిగి నేలమీాదపడ్డాడు. తెలివిదప్పిపడున్న దుర్గాదేవి వొక్క-కేకపెట్టి పైకి లేచింది. S I గారు అమాంతం నా రెండు చేతులూ పట్టుకున్నారు. యిదంతా క్షణంలో స్వప్నంలాగా జరిగిపోయింది. డాక్టరు గారు మెల్లగా పైలేచారు. పాపం ఆయన నోటంట రక్తం కారుతూవుంది. దుర్గాదేవి S I ని చూచి మరలా మూర్చ వచ్చిన దానిలా పడిపోయింది. స్వాములవారు లోనుంచి వేఢి పాలు గ్లాసునింఢా తెచ్చి డాక్టరుకుయిచ్చారు. ఆయన మారు మాట్లాడకుంఢా గ్లాసెడుపాలు త్రాగేసి వొట్టిగ్లాసునుస్వాముల వారికందిస్తూ S I దగ్గరకొచ్చి)

ఢా. అతన్ని విడిచిపెట్టండి. అతనికిప్పుడు తాత్కా-లికంగా పిచ్చి వొదిలిపోయింది.

నే. నాకా మీాకా?

ఢా. ఆవిషయం S I గారికె తెలుసు పోనీ యిప్పుడుచెప్పండి మీారు దుర్గాదేవి భర్తేకదూ?

నే. దుర్గాదేవి నాభార్య కాదంటే?

ఢా. మీాపిచ్చి యింకా మొదల్లోనే వుందన్నమాట!

స్వా. నిజంచెప్పునాయనా నీకొచ్చిన ప్రమాదమేమీాలేదు. ఆ సర్వ లోకమూర్తి నిన్ను తప్పక రక్షించగలడు. అమాయకురాలు దుర్గను అల్లరిపాలు చెయ్యకు. చెప్పునాయనా దుర్గ నీభార్య కదూ?

నే. (S I తో) యిదేమిటండీ యిన్నాళ్లెన్నుకంపెనీ యేజంట్లులాగా తగులుకున్నారేమిటి పోనీ చెప్పెయ్యమన్నారా...మీాకభ్యం

తరం లేకపోతే...(S I గారు నావంక వారివంక చూచారు తర్వాత యేదో దీర్ఘంగా ఆలోచించి యింతసేపూ-తనువ్రాసు కున్న రికార్డుపుస్తకం జోబులో పెట్టి ఢాక్టరును సమీపించి)
డాక్టరుగారూ ప్రస్తుతం పేషంటులాపడున్న ఆమె ప్రాణానికి మీరు పిచ్చివాడు, మూర్ఛరోగి అంటున్న యితనికి మరో రెండు గంటలవరకు On.y two hours ప్రాణానికెమీప్రమా దంవుడదని హామీ యిస్తారా?
ఎందుకండి?
రోగిని కదల్చటానికి వీల్లెదు. ఆమెలేనిదే యితను రావటానికీ వీలుండదు. కాబట్టి మీ స్వంత పూచీమీద వీరిరువురినీ మరో రెండుగంటల వరకూ కాపాడవలసిన బాధ్యత మీ కప్పగించి పోతున్నాను. యిందుకు మీరు సమ్మతిస్తారా?
(డాక్టరు, స్వామి వొకరినొకరు చూచుకున్నారు.)
యీ మురికి కంపులో నే నెందుకండీ మీతోలే వొస్తాను పదండి!
వీల్లేదు. మీరు రెండుగంటలవరకూ యిక్కడుండాల్సిందే!
(డాక్టరుతో) ఏమంటారు?
All right! I will take care of these two people!
వో కాగితంలో వ్రాసివ్వండి! (డాక్టర్ రాసిచ్చాడు. కాగితం చూచుకొని మడిచి జోబులో పెట్టుకొని నన్ను అదోలా చూస్తూ S I గారు, నిష్క్రమించారు. నేను S I గారు పోయిన దిక్కునే చూస్తు బెదురుగా నిలబడి వున్నాను).
ఏయ్ మిష్టర్...నిన్నే!
(జవాబివ్వకుండా అలాగే వున్నాను చేతులు నలుపుకుంటూ)
(నా దగ్గరగా వెనుకనిలబడి) మిష్టర్...నిన్నే!
(తిరిగి చూచాను.)
అతను, వెళ్ళిపోయ్యాడు!

అవును. మీరుండే పొయ్యారుగా!
అవుసరార్థం. సగేగాని మనదేవూరు?
మనూరికి పదిమైళ్ళే మావూరు! ఆమాటకొస్తే మీ యింటికి పక్కిల్లే మాది.
అవ్యక్తుడా—అడిగినదానికి సరియైన సమాధానం చెప్పవేం? మాట్లాడటానికి మీగ్గూడా నోరొచ్చిందా స్వామీ? యింత క్రితం యెవరి కరువిచ్చారానోరు?
అధిక ప్రసంగం కట్టిపెట్టు. నీవల్ల అన్నీ అనర్థాలే. ప్రాప్తిం చాయ్ మాకు.
మాకు అంటే మీగ్గూడా యీబిజినెస్‌లో షేరుందాస్వామీ చాలించు వదరుబోతా! పెద్ద పెండ్లి కుమారుడిలా బయల్దేరొచ్చావ్. పిరికిపండలా పారిపోజూచావ్! నీలాంటి వాడికి యెవరిస్తారోయ్ పిల్లను!
ఆ మాట S I గారినే అడగలేకపొయ్యారా?
పోనీ నువ్వే యెందుకు చెప్పలేక పొయ్యావు?
ఏమని?
నువ్వు వొక Idiot వని?
ఆమాట, మీ దవడనడగండి చెబుతుంది!
shut up! I will shoot you Rascal!
Strong medecine యిస్తామంటూ—యిప్పుడు Shoot చేస్తానంటారేమిటి? (దుర్గాదేవి ఊర్మిళాదేవిలాగా ఆవులించు కుంటూ పైకిలేచి, నడుం విరిచి, కళ్ళు తెరిచి)
S I వెళ్ళిపొయ్యాడా?
వెళ్ళిపొయ్యాడు Darling! నేనే పంపించేశాను!
(మరలా ఆవలిస్తూ) నాకు నిద్రవొస్తుంది!
Oh yes! నిద్రపో డియర్!. (స్వామితో) స్వామీ తమ రింకా భోంచేసినట్టు కనిపించటంలేదు. వెళ్ళి భోంచెయ్యండి.

దుర్గా వొకేసారి భోంచేసి నిద్రపోరాదు!
నాకు ఆకలిలేదు. మీరు వెళ్ళండి. (ఆవులిస్తూ) నేను నిద్ర పోవాలి. (సోఫాలో కూర్చుని కళ్ళు మూసింది).
డాక్టర్ గారూ తమరు కూడా...
No. No. నే నిప్పుడు భోంచెయ్యను! అందులో యీ రోజు శనివారం. మీరు వెళ్ళండి. నే నిక్కడే వుంటాను. (స్వామి వెళ్ళిపొయ్యాడు.)
(యిప్పుడా ప్రదేశంలో నేనూ డాక్టర్, దుర్గా మిగిలున్నాం. డాక్టర్ తిన్నగా నడుస్తూ నాదగ్గరకొచ్చి నిలబడి నన్ను చూస్తూ నిలబడ్డాడు. నేను ఆయన్ను చూస్తున్నాను).
నేను యింకా భోంచెయ్య లేదండి!
డాక్టర్!
Yes dear! (పరుగులో ఆమెను సమీపించాడు).
(తనచేతిని అయనపై వేస్తు) అతను వెళ్ళిపొయ్యాడా?
(ఆమె చేతిని తడుముతూ నన్ను చూచి ఆవేశాడు) ఆ! వెళ్ళిపొయ్యాడు.
అబ్బ! ఎవరని మీ అర్థం?
స్వామికదూ?
కాదు Darling!
వోహో యితనా—అపర ప్రవర మహాశయులు? యిక్కడే వున్నారు!
(యిప్పటికి కళ్ళుతెరచి చూచి రెప్పలు రెపరెపలాడిస్తూ నావంక విచిత్రంగా చూస్తు) ఇతనెవరు?
ఎవరో కత్తిరిగాడు! అవారా! 420, & కిస్మత్తు.
ఇంతలోకే యెంత పాతబడి పొయ్యాను రా తండ్రీ! ఔరా మద్రాసు నగరమా!
(విజయలక్ష్మిని చేబట్టిన వీరవనితా కీవిగా నా వద్దకొచ్చి) ఏయ్! ఎవరునువ్వు.

యీ మాట 15 నిముషాలముందే అడిగుంటె యెంత సంతో
షించేవారు!
ఎవరు ?
S I గారు!
ఆయన తరఫున యిప్పుడు మీరు యేడుస్తున్నారా!
లేదు వారికోసం యెదురు చూస్తున్నాను!
పాపం, ఎంతస్వామిభక్తి?
సాని భక్తి మాకెలా గొస్తుంది?
అయితే మీరెందుకొచ్చారిక్కడికి?
"తెలుగునాడు" నడగండి!
ఓహో పెండ్లి చేసుకుందామని వొచ్చారా... పాపం...!
లేదు తల్లీ లేదు. గొంతుకు వురితగిలించుకుందామనేవొచ్చాను!
తొందరపడకండి అంతపని యెటూ జరిగిపోతుంది! (హేళ
నగా నా మొఖాన్ని చూస్తు డాక్టర్ నుద్దేశించి) dear!
Yes darling! (ఆమె ప్రక్కగా నిలుచున్నాడు).
యితను యెవరో యితనికే తెలీదట. చాలా నీతిగల మనిషి
నని చెప్పుకుంటున్నాడు. S I దగ్గర తన నిజాయితీని నిల
బెట్టుకోవాలని చాలా చూచాడు. యేమీ లాభం కనిపిం
చలా! చివరకు చిక్కుబడ్డ జక్కజింకలా బెదురుచూపుల్తో...
మనముందు హాజరు. అంతేనా?
పాపం యితను యేవూరు పెద్దమనిషో?
పట్నవాసం చేరిన పల్లెటూరి నాటు రకంలా వున్నాడు.
మెదడంతా ఖాళీ.
వొట్టి పిచ్చిపుల్లయ్య! (డాక్టరు, ఆమె వొకరినొకరు చూచు
కొని నాపైన చాలా హేళనగా నవ్వుకున్నారు. తర్వాత
ఆమె నన్ను అదోలా చూస్తు) ఏయ్!
ఊఁ!
ఆడదంటే నీ కుభయమా?

ఈ జన్మలో లేదు!
అందమూ, యవ్వనమూగల స్త్రీ అంటె నీకు చాలాబిడియం.
నీవు ఆమెను ప్రేమించలేవు.
తృప్తిగా ఆనందిస్తాను!
పెద్ద రసికుడులా మాట్లాడుతున్నావ్. నేను నీభార్యనని చెప్ప లేక పొయ్యావ్.
టెంపరరీ భర్తనని చెప్పానుగా!
గొప్ప అవకాశాన్ని చేతులారా జారవిడిచావు!
అది నరకమని తెలిసే విడిచిపెట్టాను!
అబ్బో! అపర భీష్ముడివి బయల్దేరావు వుద్ధరించటానికి!
మీరూ వున్నారుగా నా పాలిటికి శిఖండిలాగా!
(డాక్టరునానుకొని దొంగేడ్పులు ప్రారంబిస్తూ) చూడుడియర్ నేను శిఖండినట యెంతమాటడిగాడో చూడు. నేనంటే ఇతనికి లేక్క లేదు యిదినాకెంత అవమానం?
(పెద్ద వీరుడిలా ఫోజుపెట్టి) ఏయ్ stupid యీామెను అన డానికి నీకేమిహక్కుంది ఆట్టె వాగావంటె నీహార్టు ఆపరేషన్ చేసి బయటలాగి పారేస్తాను. మర్యాదగావుండు. యీామె ఎవరో తెలుసా?
మద్రాసు కోడి
యేడిశావ్ అందాలరాణి! (ఆమె బుగ్గలు అప్యాయంగా తడు ముతాడు.)
కాదు అందరికీ రాణి!
ఏం కూసావ్? Rascal (నా చెంపమీాద బాగా గురిచూచి బలంకొద్ది కొట్టేశాడు. ఆదెబ్బతో నాకుదీపాలు కనిపించాయ్ నేలకొరిగాను కానీ వెంటనే పైకిలేచి డాక్టర్ పై కసి తీర్చుకుం దామని మీదకు పొయ్యేసరికి దీపాలు ఆరిపోయినయ్. నాపైకి మాత్రం యేదో వెలుతురు ప్రాకుతూవొచ్చింది.)

చి: దుర్మార్గుడా! నీరాకతో మాఆశ్రమం అశాంతినిలయ మైంది. నీలాంటివారికి నరకమే నివాసం. నీప్రాణం పిండితే గాని యీపాపమంతా పరిహారంకాదు. ఊ కదులు...రా... నేరుగా...ముక్కుసూటిగా...నడూ...(నేను అలాగేమూగ బొమ్మలా నడిచి గదిలోకెళ్ళిపోయ్యాను ఆప్రదేశంలో మిగిలి పోయిన డాక్టరూ, ఆమెను గురించి వారి చర్యలను గురించి కొంత ఆలశ్యంగా నాకు తెలిసినప్పటికీ మీకు యిప్పడే యీ సందర్భంలోనే చెప్పటం ముఖ్యం. తర్వాత యేంజరిగిందంటే నేను గదిలోకెళ్ళగానే యధాప్రకారం దీపాలన్నీ వెలిగిపోయి నయ్. డాక్టరూ ఆమె జల్సాగా కుర్చీలో కుర్చుని జల్సాగా నవ్వుకుంటున్నారు. డాక్టరు ఆమెబుగ్గలు నిముగుతూ)
లేదు డార్లింగ్-వీడు బ్రతికుంటే యెప్పటికైనా మనకు ప్రమా దమే!
చస్తేమాత్రం వొచ్చే ప్రమాదం తప్పుతుందా?
వీడు పిచ్చివాడని S I గూడా నమ్మేశాడు. పైగా మూర్ఛ కూడావుందని నేను బలపర్చి చెప్పాను. యే టైంలో యెగిరి పోతాడో యెవరికి తెలుసు!
అయితే......
వాడు కైలాసానికి ప్రయాణం కట్టాల్సిందే.
చంపేస్తారా?
వాడు బ్రతికితే కేసు బలమవుతుంది., మనల్ని కొంచానా విడిచిపెట్టడు S I.
అప్పుడు మీరే నాభర్తని చెపుతాను!
నెంబరడిగితే?
(వొయ్యారంగా నడచుచూ) మీకుగూడా నేను వేళాకోళమై పొయ్యానా?
పోనీ మీస్వాములవారినే చూపించు?
ఛీ! దొంగబ్రతుకోడు చచ్చినా చెప్పను.

మరి నేనైతే!
మీగయ్యేదేమిటి—మీరు నాభర్తగా! మీరంటే నాకెంతో ప్రేమ! చందమామలాంటి మీ అందం కోసం యెల్లప్పుడూ నా హృదయం తల్లడిల్లి పోతూవుంటుంది మీరంటే నాకెంత భక్తివుందో చెప్పలేక పోతున్నాను.
నాకుమాత్రం లేదంటావా దుర్గా! కాని యీ పాడు ప్రిస్టేజీ నిగురించి కొంచం వెనక్కు తగ్గాల్సొస్తుంది లేకపోతే అనుదినమూ నీరూపం యింప్రూ కావటానికి యెన్నో యింజక్షన్స్ యిచ్చేవాడిని నీబరువు పెరగడానికి, నీ Health స్టడీ కావడానికి యెన్నో టానిక్కులు, టాబిలెట్సు, Use చేసేవాణ్ణి ప్రతిరోజూ Xray లు తీసి నిన్ను యేరోగమూ ఆవరాచకుండా జాగ్రత్తగా కనిపెడుతూ వుండేవాడిని. నీ అందం చూస్తుంటే నాకు చాలా ఆనందమేస్తుంది. నీలాంటి Beautiful young girls ని, చేతిలో చెయ్యివేసుకొని జాలీగా క్లబ్బుకు పోతూవుంటె యెంత మజాగా వుంటుంది. డాన్సులు...డ్రింకులు... దర్జాలు వోహూహూ...యింద్రభోగమనుకో!
మీదంతా వొట్టి బూటకమేలెండి.
బూటకం—దు నాటకం అంతకుముందే నాచేతకాదు. అసలు నేను Actor నే కాదు వొట్టి డాక్టర్ని.
(ఆప్యాయంగా అతని మైలాగుతూ) నిజంగా నన్ను ప్రేమిస్తున్నారా?
ప్రేమించటమా—ప్రాణం వొదిలేస్తున్నాను. రోగిని పరీక్షించేటప్పుడు నీధ్యాన్నమే, యింజక్షన్ చేసేటప్పుడూ నీరూపమే ఆపరేషన్ సమయంలోకూడా నీపేరే జపిస్తుంటాను.
ఇంతకూ రోగులు బ్రతుకుతూవున్నారా మీహాస్పిటల్లో?
చస్తేమాత్రం మనకొచ్చేనష్టమేమిటి! నీ అందాన్ని అరగిస్తు నీప్రేమలో మైమరచినిద్రపోతే అంతేచాలు అదేనాకుఆనందం

అదేనాకు టానిక్కుల్లా పనిచేస్తుంది. యేదీవొక్క.........
Kiss ! (తనమూతిని ఆమెకు దగ్గరగా పోనిస్తాడు)
(వయ్యారంగా తన చేతితో డాక్టరును నెట్టుతూ) ఏంటి పని పిల్లాడిలాగా ! ఎవరైనా చూస్తారు.
యెవ్వరూ చూడలేరు. మనం యెవ్వరికి కనిపించం! అబ్బ! (మైకంలో వున్నవాడిలా) రా దుర్గా...తనివితీరా వొక్కసారి కౌగలించుకో! నిన్ను చూస్తున్నకొద్ది నాలో యవ్వనం సుడిలాగా తిరిగి తిరిగి పైకి వుబుకుతూవుంది
మన్మధుడు మత్తు యింజక్షన్ చేసినట్టుంది. రా...దుర్గా నన్ను నీలో చేర్చుకో !
(అతని పట్టు విడిపించుకొని) ఏమండీ !
ఏ మం డీ !
నాకు చాలా రోజులనుంచి వొక అనుమానం వుందండీ !
ఏవరిమీద ?
మీలాంటి వారి మీదే! మీరింకా యెంతో పవిత్రంగా భావించే మీ భార్య వుందికదా ? పిచ్చి కుక్కలా మావెంట పడతారెందుకండీ! మీభార్య మీకానందాన్ని న్వాదా చెప్పండి!
అబ్బ ! యీ ఆనందఘుడియలో దాని పేరెందుకెత్తావ్ దుర్గా! దాన్ని చూస్తేనే అసహ్యమేస్తుంది. అదినాభార్యని చెప్పుకోడానికి గూడా సిగ్గుపట్తానునేను. ఎండిపోయిన బక్కపీనుగలా వుంటెంది. మున్సిపాలిటీ రోడ్లమీద పిత్కొచ్చిన గొక్కిరాళ్ళులావుంటాయ్ దానిపండ్లు, మొఖమంతా అమ్మవారిమచ్చలు గ్రుడ్లగూబలాగా చూస్తుంది. యెప్పుడూ పొయ్యిదగ్గర పని చెయ్యడం. ప్రతియేటా విసుగులేకొండా పిల్లల్నికనడం దాని పని అందమన్నా, ఆనందమన్నా, దానికేం తెలుసు, పర్సనాలిటీ Keep చేసుకోమని గోలపెట్తాను. ఆమూలకాకి వినిపించుకుంటేగా !
మీకు పిల్లలెంతమంది ?

ఆఁ! వుంటారో అరడజను. దాంతో మన కేం పనిలే?
మీకు వయస్సెంత?
వుంటాయ్ వో Thirty or Thirty five?
నేను నమ్మను!
పోనీ వో Forty వేసుకో!
అంతేనా?
యింకో Five add చేయండి! Total forty five!
ఇంకా మీ-కీ ప్రేమ పిచ్చెందుకండీ?
చచ్చేవరకూ మా నాన్నగారు ప్రేయసి ప్రక్క-నేవున్నారు.
నేనంటె మీ కిష్టమేనా?
యిష్టమా? నా Heart నడుగు చెబుతుంది! నా బ్లడ్ పరీ
క్షించు తెలిసిపోతుంది! దుర్గా యింకా నన్ను అనుమా
నిస్తున్నావా?
[అతని బుగ్గలు చేతితో మెల్లగా తాకుతూ] ఎంత మాట
న్నారు. మిమ్మల్ని నే నెంతగా నమ్మానో, మీరంటే ఎంత
భక్తితో పూజిస్తున్నానో మీకు తెలీదు. మీరు లేందే నేను
వొక్క-క్షణమైనా బ్రతగ్గలనా!
[ఉబ్బి తబ్బిబ్బులై పోతూ] I know it perfectly! నాకు
చాలా బాగా తెలుసు. Oh my dear Durga! Oh my
heart! Oh my sun shine! I love to thee my dear!
I pray to thee my darling! చెప్పు! నీకేం కావాలో
చెప్పు! ఆరోగ్యానికి First class high class Tonic
prescribe చేసీమంటావా లేక Costly Necklace వొకటి
కొనిపెట్టమంటావా? అమెరికన్ మేడ్ టాయిలెట్ సెట్టు
ప్రెజెంటు చెయ్యమంటావా? నీ శరీరంలోని క్రిములు, జబ్బులు
చచ్చిపొయ్యేట్టు మాంచి Injections చెయ్యమంటావా?
ఈరోజు నాకానుకగా ఈ 500 నీకు బహూకరించమంటావా?
(తను యిప్పి కుర్చీకి తగిలించిన కోటు జోబులో చెయ్యిపెట్టి

చూచుకుంటాడు. అందులో కనిపించలేదు. జోబులన్నీ వెతికాడు కనిపించలేదు. చాలా హడావిడిగా మరలా వెతికి చూచాడు. లాభంలేదు.) యేవీ? డబ్బులేవి? Five hundred rupees! అక్షరాలా అయిదువందలు. యీ జోబులోనే పెట్టాను. యెవరో Pick pocket చేశారు. అయ్యో యెంత కష్టపడి తెచ్చిన డబ్బు! యెంతో ప్రేమతో—From the bottom of perrified heart! మీకిస్తామని తెచ్చాను. యిప్పుడేం చెయ్యాలి?

(బాగా విరగబడి నవ్వుతూ వుంది)

అలానవ్వకు నాకుచాలా Shameగా వుంటుంది! డబ్బులు జోబులో పెట్టుకొని బయల్దేర బోతున్నాను. హోటల్నుంచి నువ్వు ఫోను చేశావ్, యేదో గొడవ జరుగుతుందని యెకా యెకిని వొచ్చేశాను.

ఆహడావిడిలో ఎక్కడైనా పడి పోయిందేమో!

లేదు, కోటు విప్పేటప్పుడు కూడా చూచుకున్నాను, జోబులో నేవుంది డబ్బు!

డబ్బుకుగ్యారంటీ యెక్కడుందండి! యెవరో ప్రేమించారు పట్టు కెళ్లి పోయారు! యింతకు మీరు నాకు యివ్వాలని తెస్తేగా? మీకివ్వాలనే తెచ్చాను. నాWife చీరలు కొనివ్వ మన్నా వీల్లేదన్నాను. నా Children చొక్కాలుకుట్టివ్వమని మారాం చేసినా నాలుగు తన్ని యీ రోజు వీలుకాదన్నాను. యీ డబ్బు మీకు తప్ప మరెవ్వరికీ ఖర్చుకాగూడదని నా పట్టుదల యేం చేయును. యెవడోదొంగ కొట్టేశాడు. యీ దొంగ తనం యిక్కడే జరిగింది. నేను దీన్ని విడిచిపెట్టను. యిప్పుడే S I కి రిపోర్టుచేస్తాను. వుండండి స్టేషన్ వరకువెళ్లొస్తాను! (తొందరగా. వెళ్ళబోతాడు. ఆమె అతని చేయి గట్టిగా పట్టుకొని).

(అమిత ప్రేమను నటిస్తు) పోనివ్వండి నా దురదృష్ట మనుకుంటాను. అంతకన్నా చేసేదేముంది. పోలీసు రిపోర్టిస్తే మాత్రం

పోయిన డబ్బు తిరిగొస్తుందా! మీరు నాపైన ప్రేమగా, అనురాగంగా, వుంటే అంతేచాలు. నాకదే పదివేలు. మీ రిక్కడే కూర్చోండి!
వీల్లేదు. ఆ అయిదువందలు దొరికే వరకూ, అవి మీచేతిలో పడే వరకూ నేను నిద్రపోను రిపోర్టు యిచ్చి తీరాల్సిందే. యిప్పుడే S I ని పిలుచుకొస్తాను!
ఎవరు దొంగిలించారో తెలియకుండా యేమని రిపోర్టిస్తారు?
యీ యింట్లోవారే దొంగిలించారని చెబుతా!
ఎవరు? స్వాములవారా?
చా ఛా! వారినను కుంటె కళ్ళుపోతాయ్.
మరి నేనా?
చచ్చినా ఆమాట అనటానికి నాగుండె చాలదు?
మరి యింకెవరున్నా రీయింట్లో మీరుతప్ప! ఆ! ఆ పిచ్చి ముండా కొడుకేమో!
కరెక్టు! సరిగా చెప్పావు! యిప్పుడే వాడి ప్రాణం తీసేస్తాను!
కాస్త దూరంగా వుండి మాట్లాడండి! ఈసారి...
వాడితోలు ఆపరేషన్ చేసేస్తాను! నిజం చేబితే సరి, లేకుంటే చచ్చాడే!
మీరు యుద్ధం చేస్తారేమోనని భయంగా వుందండి!
లేకపోతే ముద్దుపెట్టుకుంటానా ఆ వెధవను? గుద్దిగుద్దిచం పేస్తాను!
మీ కంత బలంకూడాలేదు. నాకదే భయంగా వుంది!
చూస్తావుగా! యిప్పుడే వాడంతు తేల్చుకుంటాను! (చర చరా లోనికెళ్ళాడు) (మరలా తిరిగొచ్చి ఆమెను బుగ్గలపై చరిచి తల నిమురుతూ) dont fear! వస్తాను! (లోపలకెళ్ళి పొయ్యాడు అతను వెళ్లిన తర్వాత ఆమె కొంచెం అటూ యిటూ పచారుచేస్తు, వొక్కసారి ఆవులించి వొడలు విరుచు కుంటూ అద్దంవద్ద నిలుచుని తన అందాన్ని తనివిదీరా చూచుకొని మురిసిపోతూ వుంది. స్వామి లోనుండి తొందరగా

వొచ్చాడు. మనిషి కొంత మారకంగా కనిపిస్తున్నాడు. కాని
పైకి యేమి తెలియనట్లు పరమశాంతిమూర్తిలా నటిస్తూ
దుర్గ వెనకాలా నిలుచుని)
శ్రీమతి దుర్గాదేవి గారూ !
(తత్తరపడి) ఎవరు ? (తిరిగిచూచి) దొంగా. నువ్వేనా ?
(ఆమె బుజాలపై తన చేతులు పెట్టి ఆప్యాయంగా) యింకెవర
నుకున్నావు ?
ఎవరో క్రొత్తవాళ్ళను కున్నాను ! కొంపతీసి మరలా S I
వొచ్చాడేమోనని భయం.
దీపాలన్నీ ఆరిపోకుండా క్రొత్తనాడెలా రాగలుగుతాడు ?
(నడుస్తు) ఏమో ! ఎందుకు రాకూడదు ?
అందుకనేగా ప్రత్యేకించి యిన్ని Electric arrangements
చేయించింది !
అదంతా మీా దురదృష్టం ?
అంతా మన అదృష్టం కోసమే ! (ఆమెను తనివితీరా చూచి)
యిప్పుడు నువ్వెంత అందంగా వున్నావో తెలుసా ? యేమి
చెప్పాలో నాకు నోరు రావటం లేదు.
నన్నుగురించి చెప్పటానికి మీా కెప్పుడూ నోరు రాదు.
అలా అనకు దుర్గా యీా సంపాదనంతా నీ కోసమేగా ! నీ
అందం కోసమే !
(నిటూర్చి) ఏమందమో ! అందరికీ తాకట్టు పెట్టే అందం !
అలా అనుకుంటె ప్రపంచంలో బ్రతగ్గలమా ?
ప్రపంచంలో అందరూ బ్రతకలేక నే చస్తున్నారా ? ముష్టివాడు
గూడా బ్రతుకుతూనే వున్నాడు !
బ్రతుకుతున్నాడు ఎంగిలిమెతుకులతో - ఎండిపోయిన మెతు
కలతో! అందులో వాడు ఆనందమేం రుచిచూస్తాడు ?
యిప్పుడు మనం చూస్తునే వున్నాంగా ప్రతి క్షణంలో చావు
గంధాన్ని !

ఇవన్నీ మనకొతెక్కా. అందరికీ జడిసి యీ మద్రాసులో యింతకాలం వుండగలిగే వారిమేనా? డబ్బు దండిగా వుంటే, పేరు దర్జాగా వుంటుంది. యీ డబ్బనేదే అందరికీ లైసెన్సు. దీన్ని చేతిలో పెట్టుకొని యెన్ని పాట్లు పడ్డా పేరు పెరగడమే గాని, తరగటమంటూ వుండదు. నీ హోదాను, నీ డబ్బును, నీ దర్జాను, గౌరవించినంతగా నీ వృత్తి, నీ గురించి యెవ్వరూ పల్లెత్తు మాటయినా అనలేక పోతున్నారు నీకు దాసులై పోతున్నారు. కనికరించమని వేడుకొంటున్నారు. కోరినంత డబ్బునిచ్చి నిన్ను తృప్తిపరుస్తు వున్నారు. కష్టంలేని ఆర్జన. కడుపునిండా తిండి. వొంటినిండా బట్టలు - పదిమందిలోనూ పలుకుబడి, యెంత అదృష్టం చేసుకొంటె వొస్తుందంటావు? పిచ్చిదానా! తొందరపడి గంతులేయకుండా, నిలబడి కార్యం సాధించాలి. డబ్బు సంపాదించాలి. పలుకుబడి తనంతట అదే మన కాలిముందు వొచ్చి పడ్తుంది.

నిరుద్యోగి మొదలు మహారాజు వరకూ నీ చేతిలో పిట్టలై పోతారు. దొంగతనం చేస్తూ దొరలాగ పైకి కనిపించాలి. సాదువు వేషం కట్టిన సామ్రాజ్యాన్ని జయించేలా వుండాలి. సానివృత్తి చేసినా సంసారిలాగా నటించాలి. ప్రస్తుతయుగంలో యీసూక్ష్మం తెలుసుకుంటేనే జీవితానికి మోక్షం. యింత కాలం నాతో వున్నావ్ ఇంకా ఈసూత్రాలు తెలుసుకోలేదంటే తెలుసు కోలేక కాదు, నటించలేక కాదు, యిందులో మిమ్మల్ని నమ్మినంతగా ప్రపంచం నన్ను నమ్మలేదు. అందుకేగా S I నన్ను తరుము కుంటూ వచ్చింది. సమయానికి అతనుండ బట్టి కొంతవరకు బ్రతికి పొయ్యాను... లేకుంటే మీమీదనే చెప్పేదాం అనుకున్నాను. యింతకు అతనెవరు?

యెవరో నిరుద్యోగి. పత్రికలో ప్రకటన చూచి నిన్ను పెండ్లి చేసుకుందామనొచ్చాడు.

మీ రేమని చెప్పారు?

ఆ అమ్మాయి చచ్చిపోయిందని చెప్పాను. పాపం...అమా యకుడు నీకోసం దేముడితో యుద్ధం చేస్తాడట. దేశంకోసం కాకపోయినా నీకోసం ప్రాణమైనా విడుస్తాడట. తనవెంట తెచ్చినసామాను 300 రూపాయలు యేదే దెయ్యం కొట్టేసిం దట...యేమేమో చెప్పాడు!
ఇంతకూ S I వస్తే యేంచెపుతాడో భయంగావుంది.
పర్వాలేదు డాక్టరున్నాడుగా అతను పిచ్చివాడని కచ్చితంగా చెప్పేస్తాడు. చెప్పడమేకాదు, Certificate కూడా యిస్తాడు అతనిమాటకు అడ్డేముంది గౌర్నమెంట్ మెడికల్ ఆఫీసరు. అతనులేకపోతే నీనాటకమంతా కపటమైపొయ్యేది. యేలాగైతేనేం యీవిపత్తునుంచి బయటపడ్డాం. డాక్టరుకు, నిరుద్యోగికి, సలాంచేసి మనం మాయమైపోవడమే యిప్పుడుముఖ్యం.
అంటే.........
యింకేమిలేదు. మన బండారం బయట పడకముందే మనం ప్రయాణం కట్టాలన్నమాట!
ఎక్కడికి?
ఎవ్వరికీ కనుపించనిచోటుకు!
ఎందుకండీ?
జైలునుంచి బయటపడ్డానికి, సంపాదించినడబ్బు బధ్రంగాదాచి పెట్టుకోడానికి, అన్నిటికన్నా ముఖ్యంగా మనమిద్దరం కలసి జీవించడానికి! అంతా సిద్ధంచేసాను. డబ్బంతా భద్రంగాపెట్లో ఎవరికి తెలియనట్లు దాచేశాను. మనమిప్పుడే యీయిల్లువిడిచి ఎవరికంటాపడకుండా చీకట్లో అంతర్ధానమవ్వాలి త్వరగా యీ దుస్తులు మార్చి కాషాయగుడ్డలువేసుకో-ఎవ్వరూగుర్తించలేరు.
అయితే మద్రాసు విడిచిపెట్టాలంటారా?
మనకోసంకాకపోయనా, పరువుకోసం! భవిష్యత్తులోమనం దర్జాగా బ్రతకడంకోసం తప్పకుండా తక్షణం విడిచిపెట్టాలి పోలీసులు విడిచిపెడ్తారా మనల్ని?

వాళ్ళసంగతి నేను చూచుకుంటాను! నువ్వుత్వరగా బట్టలు మార్చుకో!
నాకేదో భయంగావుంది. నేనురాలేను మీరువెళ్ళండి. రేపు నేను వొస్తాను!
నువ్వులేకుండా వొక్క అడుగైనా వెయ్యలేను. పైగా నిన్ను తప్పకుండా అరెష్టు చేస్తారు.
ఆప్రమాదంరాకుండా నేను చూచుకుంటానులెండి!
నీతోపాటు నేను చిక్కుబడిపోతాను సంపాదించినడబ్బు మన చెయ్యిజారిపోతుంది అనుకున్నఆశలన్నీ అడియాశలైపోతాయ్ మనరహస్యంకాస్తా బయటపడిపోతుంది. త్వరగా బయల్దేరు యీబండికే వెళ్ళిపోతాం.
నేను రాలేను.
కా ర ణం?
నాకోరిక యింకా నెరవేరలేదు!
రహస్యం రచ్చకెక్కిందంటె వురితాడే మనకోరికలు నెరవేర్చేది! మీరెంతచెప్పినా లాభంలేదు. నేను మద్రాసునుంచి కదలను!
(కఠినంగాఆమెనుచూస్తూ) అయితే సినిమాతారవైపోతావన్న మాట ఏం? (ఆమెపలకదు) యిందుకేనా నువ్వు సానివైంది? డబ్బుకోసమే సానినయ్యాను. అందుకోసమేగా మీరు సన్యాసయ్యారు. యెన్నో ఆశలు చూపించి నన్నీవృత్తిలోదించారు. మిమ్మల్ని పూర్తిగానమ్మాను మీమీద యిష్టంలేకపోయినా మీరు చెప్పినట్టెనడిచాను. యెందరినో మోసంచేసాను. నాశనంచేశాను. డబ్బుసంపాదించాను. యేం లాభం...నాజీవితం కలుషితమైపోయింది. అందరివిలాసానికి ఆటస్థలమైపోయింది మీమాటలువిని బాగా మోసపొయ్యాను. యింకా నన్నెందుకు వేధిస్తారు నన్నువిడిచిపెట్టండి. మీదారి మీరుచూచుకోండి నేనేలాగున్నా యేమైనా నాకుచింతలేదు నేనుమీవెంట రాలేను క్షమించండి!

అయితే సంపాదించినదాంట్లో నీకు చిల్లిగవ్వ కూడా యివ్వను. నాలో ప్రాణమున్నంతవరకు కాణీకూడా బయటకు తీసుకెళ్ళలేరు! ఇదంతా నేను సంపాదించిందే యిందులో నీకేమి భాగంలేదు! దీపాలార్పి దేముని పేరుచెప్పి వొచ్చినవారిని మోసంచెయ్యడమేనా మీరుసంపాదించింది? యీరోజువరకూ నా సంపాదన మీదనే మీ జీవితం గడుస్తుంది. నేనుపెట్టిన బిక్షవల్లనే మీరు యింతవరకూ బ్రతుకుతున్నారు. సిగ్గులేకుండా ఆడబ్బుమీదని యేలా చెపుతున్నారు.

(తీవ్రంగా) మాటలు మహాజోరుగా మాట్లాడుతున్నావ్?

మీరు యెంత దబాయించినా లాభంలేదు. యిక్కడెవ్వరూ భయపడేవాళ్ళులేరు. మర్యాదగా యిప్పుడే వెళ్ళిపొండి S I రాకముందే వెళ్ళిపొండి నాడబ్బులో వొక్క కాణీకూడా ముట్టుకోటానికి మీకధికారంలేదు. వెళ్ళండి. ముందు నాదగ్గరనుంచివెళ్ళండి మీ ముఖం చూడలేకుండా వున్నాను. (రెండు కళ్ళూ గట్టిగా చేతుల్తో మూసుకుంది)

సరే చూస్తాను. నువ్వేంచేస్తావో చూస్తాను! [విసురుగా లోనికెళ్ళిపొయ్యాడు].

[ఆమె కంగారుగా పచార్లు చేసింది. యీలోగా డాక్టర్ గారు నన్ను దొంగలాగా చొక్కాపట్టుకొని వొడివొడిగా లాక్కొచ్చి పెద్ద ఘనకార్యం చేసినవాడిలా ఆమె ముందునిలబడి]

చూడు డియర్ యీ దొంగరాస్కెల్ యెంత తన్నినా నిజం చెప్పటం లేదు. అయిదు వందలూ వీడు దొంగిలించలేదట. Do you beleive that? నువ్వు నమ్ముతావా?

(నన్ను చాలా దీనంగా చూచింది. నేనూ ఆమెను అలాగే చూచాను) డాక్టర్ యితన్ని విడిచిపెట్టండి. పాపం ... నామీద ఎంతఆశతో ఎంత దూరంనుంచి వొచ్చాడో చివరికిలా..

[ఆశ్చర్యంగా] దుర్గా! ఏమిటిచాలా wonderfull గా మాట్లాడుతున్నావ్? నీకుగూడా యితని తోపాటు పిచ్చిపట్టిందేమిటి?

అతను పిచ్చివాడని నేనేగా మీ నోటినుంచి అనిపించింది. నామీదున్న ప్రేమకొద్దీ మీరతని మీద విరుచుకుపడ్డారు. అతను దొంగకాడు. దొంగను నేను. మీ డబ్బు దొంగలించింది కూడా నేనే. అతని మూడువందలూ నేనే దొంగలించాను. సుఖంకోరి చేసిన సానివృత్తి మీలాంటి సుకుమార హృదయాల్ని తల్లక్రిందులుచేసింది. ఇతను నిర్దోషి. నాచేతులు విరిచికట్టి చచ్చేవరకూ కొట్టండి. పాపం చేసిన నా దేహాన్ని ముక్కలు ముక్కలుగాకోసి పారేయండి. నేను పచ్చి "వ్యభిచారిని కులటను దేశానికి నల్లనిమచ్చను. ధర్మానికి చీడపురుగును నన్ను చంపెయ్యండి డాక్టర్...నన్ను చంపెయ్యండి.
(బోరున యేడుస్తూ క్రిందపడిపోయింది.)
(దీపాలు ఆరిపోయినయ్ చీకటిలో యెవరో తొందరగా కదిలి వస్తున్నశబ్దం వినిపించింది ఆమె వెంటనే) పట్టుకోండి, దొంగ పారిపోతున్నాడు పట్టుకోండి. (కేకలువేసింది) బయటనుంచి యెవరో రివాల్వర్ కాల్చారు వెంటనే దీపాలన్నీ వెలిగాయ్ S I గారు ద్వారంముందు నిలబడివున్నారు స్వామి చేతిలో యేదోపెట్టెతో S I సమీపంగా నిలబడిపొయ్యాడు. డాక్టర్ తడబడుతూ అటు యిటూ పరుగెట్టాలని చూచాడు. ఆమె గదిలోనుంచి తిన్నగా S I దగ్గరకొచ్చి) డబ్బు పిచ్చిలో భగవంతునికూడా మోసంచెయ్యాలనిచూశారు చివరకు మీరే పట్టుబడిపొయ్యారు. S I గారూ నేను పచ్చి వ్యభిచారిని ఇతను గజదొంగ మా యిద్దర్ని, అరెస్టు చెయ్యండి.
సరే నడవండి Station కి.
S I గారూ చివరకు నా పెండ్లి ఇలా సమాప్తమైంది.

అ ం టు ం డ గా

"తె ర"